# ఆంధ్రగ్రంథములు.

---

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| **శతకములు.** | | |
| భక్తిరసశతకసంపుటము I | 2 | 0 |
| ,, సంపుటము II | 2 | 0 |
| ఆంధ్రనాయకశతకము | 0 | 4 |
| మాతృశతకము | 0 | 1 |
| సుమతిశతకము, సటీక | 0 | 3 |
| కుమారీశతకము ,, | 0 | 3 |
| దాశరథీశతకము ,, | 0 | 4 |
| మానసబోధశతకము,, | 0 | 3 |
| భాస్కరశతకము ,, | 0 | 4 |
| కలువాయిశతకము ,, | 0 | 4 |
| కవిచౌడప్పశతకము | 0 | 2 |
| నృసింహశతకము | 0 | 3 |
| చంద్రశేఖరశతకము | 0 | 2 |
| దేవకీనందనశతకము | 0 | 2 |
| సర్వేశ్వరశతకము | 0 | 2 |
| సంపగిమన్నశతకము | 0 | 2 |
| కాంతాలలామశతకము | 0 | 4 |
| కృష్ణశతకము | 0 | 2 |
| వేణుగోపాలశతకము | 0 | 4 |
| వృషాధిపశతకము | 0 | 2 |
| నారాయణశతకము | 0 | 2 |
| సింహాద్రినారసింహశతకము | 0 | 3 |
| జగన్నాయకశతకము | 0 | 2 |
| ప్రసన్నరాఘవశతకము | 0 | 3 |
| రామరాఘవశతకము | 0 | 2 |
| రామరామశతకము | 0 | 2 |
| రామతారకశతకము | 0 | 4 |
| రామప్రభుశతకము | 0 | 2 |
| రామలింగేశశతకము | 0 | 3 |
| భద్రాద్రిరామశతకము | 0 | 2 |

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| ఉన్నవరాజగోపాలశతకము | 0 | 4 |
| శివముకుందశతకము | 0 | 2 |
| సదానందయోగిశతకము | 0 | 2 |
| ఒంటిమిట్ట రఘువీరశతకము | 0 | 2 |
| శాళహస్తీశ్వరశతకము | 0 | 2 |
| కాళహస్తిశతకము | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము | 0 | 3 |
| చిత్తబోధశతకము,తాత్పర్యసహితము | 0 | 3 |
| సూర్యనారాయణశతకము | 0 | 2 |
| రాజలింగశతకము | 0 | 4 |
| రఘుతిలకశతకము | 0 | 2 |
| మహిషాసురమర్దనిశతకము | 0 | 2 |
| ఉద్దండరాయశతకము | 0 | 2 |
| రుక్మిణీపతిశతకము | 0 | 2 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0 | 2 |
| ముకుందశతకము | 0 | 2 |
| శివశతకము | 0 | 2 |
| రమానాయకశతకము | 0 | 2 |
| భక్తచింతామణిశతకము | 0 | 2 |
| సీతాపతిశతకము | 0 | 2 |
| మహిజమనోహరశతకము | 0 | 2 |
| శ్రీశైలమల్లేశ్వరశతకము | 0 | 2 |
| రాజశేఖరశతకము | 0 | 2 |
| **నాటకములు.** | | |
| కూరబొబ్బిలినాటకము | 0 | 12 |
| కమలాపహరణనాటకము | 1 | 2 |
| రామవనవాసనాటకము | 0 | 12 |
| విచిత్రపాదుకాపట్టాభిషేకము | 0 | 12 |
| పాండవాజ్ఞాతవాసనాటకము | 0 | 12 |
| చినరంగారరాయనాటకము | 0 | 6 |
| కృష్ణాకుమారినాటకము | 0 | 10 |

శ్రీ

# రామచంద్రవిజయము.

ఇది

చిలకమర్తి లక్ష్మీనరసింహము గారిచే

రచియింపఁబడినది.



గ్రంథకర్తగారిఅనుమతిని

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచేఁ

ప్రకటితము.

1926.

# రామచంద్రవిజయము.

## మొదటి ప్రకరణము.

---

శ్రీమంతంబై సమస్తసంపదలకు నిలయమైన యీభరతఖండము నందలి దేశములందు ఫలవంతంబై, యతిపురాతనంబై, యనేక పావనరాజవంశసమేతంబై యాంధ్రదేశము దనరుచుండును. ఆదేశము నందు సమస్తజనసేవితమై బహుపుణ్యక్షేత్రశోభితమై గోదావరీనది ప్రవహించుచుండును. ఈగోదావరీనది ప్రవహించుచున్న మండలముల యం దన్నిటిలో జన్మమెత్తినందులకు ఫలము ఘనులకు నల్వురకుఁగూడ సహజముగ నందవలయునని యెంచియో యన్నట్లు గెలలభారము చేత భూమికిఁ దగులునట్లు వంగి యతిమనోహరమైన ఫలములచే నాఁకొన్న యాపన్నజనంబుల కెల్ల నవ్యవధానముగ నాఁకలిదీర్చుచు, శృంగారతరమైన పువ్వులచేత నేత్రములకపూర్వ మొనర్చుచు, సమస్తపుష్ప జాతములనుండి వీతెంచు వాయువుచేత ఘ్రాణేంద్రియమునకుఁ దృప్తి గావించుచు, దూరప్రయాణములచేత నలసిసొలసి వచ్చు పాంథజనంబులకుఁ జల్లనినీడ నిచ్చుచు, సర్వావయవములకును నేకకాలముననే మహానందము గల్గించుచు, ధరణీరమణికిఁ జేసిన యపూర్వాలంకారములో యన వెలయు తీయమామిళ్ళు, పనసలు, నరంటులు, కొబ్బరులు, పోఁకలు మొదలగు ఫలవృక్షములకుఁ గన్నతల్లియై కోనసీమ భాసిల్లుచుండును. ఆకోనసీమయందెల్ల సౌందర్యసీమయు సుఖములకు దాపురంబును నమలాపురముగదా! ఆగ్రామము మొదట జిన్నదైనను పుణ్యపురుషులనేకులు తమకీర్తి యాచంద్రతారార్కముగ భూమండలమున నెలయునట్లు బ్రాహ్మణోత్తములకు సుక్షేత్రములయిన భూముల నిచ్చి వారి నివాసార్థమై కట్టించిన యగ్రహారములచేతఁ జుట్టుప్రక్కలనున్న గ్రామములకంటెఁ బెద్దదై, శౌక్యులు మిక్కిలి నివసించుటచేత నొకపట్టణము వలె నుండును. కోనసీమయం దంతటను, ముఖ్యముగా నాగ్రామమునం

దును, భూలోకకల్పవృక్షములని ప్రసిద్ధికెక్కి సార్థకనామమును ధరించిన కొబ్బరితోఁట లనేకములు గలవు. ఎంత ధన్యమైనజన్మమో కాని కొబ్బరిచెట్టును జక్కఁగాఁబరీక్షించినయెడల వేరు మొదలు మొవ్వువఱకును జనుల కుపయోగించునుగాని యొకతృణమాత్రమైనను వ్యర్థముగాఁ బోదు. మహాత్ముల జన్మము ప్రపంచోపకారార్థమేకదా? అట్టి కొబ్బరితోఁటయందుఁ దోఁట కొకయిల్లుండును. అందాతోఁటయజమానుఁడు నివసించును. వేఱే కొబ్బరితోఁటల మాహాత్మ్యము వర్ణింపనేల? పదివరహాలు గలవానికంటెఁ బదికొబ్బరిచెట్లుగలవాఁడు ధన్యుఁడను మాట సత్యమేయగు. అమలాపురమునం దుత్తరమునం దొకచెఱువును దక్షిణమునం దొకచెఱువును గలవు. మొదటిచెఱువునకుఁ జుట్టును రెండుప్రక్కల నూరుండును. చెఱువులోదిగుటకు రెండుప్రక్కల మెట్లు గలవు. రాజవీథియొక్కటే పెద్దదియున్నది. వీథికి రెండుప్రక్కలను గుమ్మములముందఱ కొబ్బరిచెట్లుండును. ఆగ్రామమునకుఁబడమట కూచిమంచివారియగ్రహార మున్నది. ఆగ్రామమునకుఁ జేరియే యొకమామిడితోఁటకలదు. విఱుగఁగాసిన యామామిడిచెట్లకాయ లెవ్వరైన దొంగిలించుకొనిపోదురేమో యను భయముచేతఁ జెట్లకు నిలువెత్తున ముండ్లకంచెవేసి, పండుట కర్హమైనకాయలు దోరఁబాఱగనె బుట్టలుగట్టి, చిలుకలు మొదలగు పక్షులు కొఱికివేయకుండఁ జేతిలో నొకయుండ విల్లుబద్ద పుచ్చుకొని మధ్యమధ్య పచ్చని మామిడాకులసందునఁ గూర్చుండి తన రంగు తెలియకుండ మోసము చేయుచున్న చిలుకవైపున నొకయుండ వేయుచు నొకకాఁపువాఁడు కాఁపుకాయుచుండును. ఆవలకోరడిమీఁద మార్గస్థుల దృష్టిదోషమునఁ దోఁటకు భంగమేమియుఁ గలుగకుండఁ గాఁపుదలిగాఁ గాఁపువాఁడు తన శిల్పశాస్త్రచమత్కారము నంతను వినియోగించి చేసిన వికృతాకారముగల యొకదృష్టిబొమ్మ గలదు. అది వేసవికాలమగుటచే నతిమనోహరమైన యావసంతఋతువునందు శృంగారలక్ష్మికిఁ బుట్టినింటివలెనున్న యాతోఁటలోనికి వచ్చి విశ్రమింపకుండ మార్గస్థులను బెదరించుచుండును. కలసిమెలసి దట్టముగా గుమిగూడుకొన్న వారిని సహస్రకరములుగలవాఁడైన భేదింపఁజాలఁడని యైకమత్యోపయోగములను జనుల కుపదేశించుచున్నవో యన గుజ్జుమామిడి

గున్నలయాకులు దట్టమై సూర్యకిరణదుర్గమంబుగా నుండెను. ప్రభాకరుఁడు తన సహస్రకిరణములను జగమునందు వ్యాపింపఁజేయుచు సర్వభూతభయంకరుఁడై భూమండలమెల్ల దహించుచుండెను. మృగవారంబులు మృగతృష్ణల జలాశయంబులుగ భావించి దాహనివారణార్థము పరుగులెత్తుచుండెను. చల్లని పండిళ్ళవలెనున్న క్రొమ్మావిగున్నలును, మావిగున్నల ప్రేలాడుచున్నయలరుజొంపముల మెక్కిమెక్కి కూయు గండుకోయిలలును, కోయిలకూఁతల నాలకించుచు మార్గాయాసనివారణ మొనర్చుకొనుచున్న పాంథజనసమూహములును వేసవికాలలక్షణంబుల వెలిసేయుచుండెను. భూమిమీఁదరాలి యెండినయాకు లన్నియు గలగలధ్వనిచేయుచు గాలికిఁ గదలుచుండెను. అగ్నివర్షము గురిసిన ఛాడ్పున గాడ్పులు వెచ్చగ వీచుచుండెను. అట్టిసమయమునఁ బ్రభవ సంవత్సర వైశాఖశుద్ధ చతుర్థినాఁ డొకమార్గస్థుఁడు మార్గాయాస నివారణార్థ మొకమామిడిచెట్టునీడకు వచ్చి మూటను గ్రిందవైచి దానిమీఁదఁగుడిచెయ్యూఁచుకొని భుజముమీఁదియంగవస్త్రముతో మొగమున స్నానముజేసినట్లు పట్టిన చెమటను దుడుచుకొనుచుఁ దల కుఁజుట్టిన సెనగపువ్వంచు జరీయుత్తరీయముచెంగుతో విసరుకొనుచు నేదియో దీర్ఘాలోచనసేయుచుఁ గూర్చుండెను. పచ్చని నిమ్మపండువంటి దేహచ్ఛాయయు, గుండ్రని మొగమును, సొగసైన కాటుకకన్నులును, సౌష్ఠవమైన యవయవములును గలిగి, సహజమైన లావణ్యముగల యాతనిశరీరమునకు రాగికడ్డీలమీఁదనమర్చిన బంగారుమురుగులును, పుష్యరాగములువేసి తాపిన తమ్మంట్లును నొక వింతయందమును గలిగించుచుండెను. అప్పుడప్పుడే నూతనముగా నంకురించుచున్న నూనూగు మీసములుచెప్పనక్కఱలేకయే యతఁడు పదునెనిమిదివత్సరముల ప్రాయముగల బాలుఁడని తెలియఁజేయును. ఆకుమారుఁడు తనలోఁ దానేదో వితర్కించుకొనుచుండఁగా నప్పు డొకముప్పదియయిదువత్సరముల చామనచాయగల బక్కపలుచని పొడుగుబ్రాహ్మణుఁ డామార్గమునఁ బోవుచు దూరమున నతనిఁజూచి, కొంచెము నిదానించి, యెవరాయని యాలోచించి, క్రొత్తమొగమని తెలిసికొని, కిఱ్ఱుకిఱ్ఱుమని

చెప్పులజోడు ధ్వనులు సేయ, నీబాలకుఁడున్నవైపునకువచ్చి యెదుట నిలువఁబడి యిట్లుపలుకరించెను.

బ్రాహ్మ—అబ్బాయీ! మన దేయూరు?

బాలు—మాది తాటిపాక కాపురము.

బ్రాహ్మ—మీ రెవ్వరు? మీయింటిపేరేమి? [రాజువారు.

బాలు—మే మాఱువేలనియోగులము. మాయింటిపేరు మాచి

బ్రాహ్మ—నీపే రెవరు? నీతలిదండ్రులు బాగున్నారా?

బాలు—నాపేరు రామచంద్రుఁడందురు. నాకుఁ దల్లి తండ్రి కూడ లేరు. తండ్రిగారుచనిపోయి నాలుగుసంవత్సరము లయినది. తల్లిగారు పోయి యీవేళ కిరువదిదినములైనది.

బ్రాహ్మ—పాపము! చిన్నతనమునందే తల్లిదండ్రులు లోకాంతరగతులయినారా? పూర్వజన్మకృతము. అయితే మీతండ్రిగారి నామధేయము?

బాలు—మాతండ్రిగారు శ్రీరాములుగారు.

బ్రాహ్మ—ఓహోహో! శ్రీరాములుగారికుమారుఁడ వఁట య్యా? సరే. అయితే మీరన్నదమ్ము లెందఱు?

బాలు—అన్నదమ్ములును లేరు. అక్కసెల్లెండ్రును లేరు. నేనొక్కఁడనే. మాబాబయ్యగారిని మీరేమైన నెఱుఁగుదురా యేమి?

బ్రాహ్మ—ఎఱుఁగుదురాయని యడుగుచున్నావా! సరి సరి. మాకూచిమంచివారికి మీరు మిక్కిలి యత్యావశ్యకమైన బంధుకోటిలోవారే. బాంధవ్య మటుండగా మాతాతగారికిని శ్రీరాములుగారి తండ్రిగారికిని బ్రాణస్నేహమని మాతండ్రిగారు చెప్పుచుండగా నేననేక పర్యాయములు విన్నాను. మాముత్తాతగారి తమ్మునికిచ్చినది మీ యూరిలోనున్న సత్యరాజువారి యాఁడుపడుచే.

బాలు—మాగ్రామములో సత్యరాజువారు లేరే!

బ్రాహ్మ—నీకేమి తెలియును? నిన్నగాక మొన్న కన్ను దెఱచినవాఁడవు. నక్క 'నేనుపుట్టి మూడువారములు కాలేదు. ఇంతగాలివాన యెన్నఁడు నెఱుఁగ' నన్నదఁట. సత్యరాజువా రిప్పుడు గన్నవరములో నున్నారు. మీగ్రామములో లేరు.

బాలు—నామధేయము?

బ్రాహ్మ—నాపేరు శోభనాచలము. మాసంగతి నీవు కుఱ్ఱవాఁడవగుటచే నెఱుఁగవుగాని మీపెద్దలందఱు నెఱుఁగుదురు. పెద్దాపురమునందు మహారాజుగారివద్ద మంత్రులుగానున్న యనపపిండివారు మాకు దగ్గఱబంధువులు. రాజమహేంద్రవరములో మాడభూషివారు మా మాతామహులు. మాతండ్రిగారికి మాడభూషివారు పిల్లనిచ్చినపుడు వెయ్యిన్నూటపదార్లు కట్న మిచ్చినారు.

అని శోభనాచలము చెప్పగానే రామచంద్రుఁడు గొప్పవారితో మాటలాడుట తటస్థమైనదని సగౌరవమున మాటలాడఁదలంచి "తమదర్శన మెన్నఁడును జేయలేదు." అనెను.

శోభ—అవును. దూరమునందున్నపు డెవరికివారే. నియోగములో బీరకాయపీచు సంబంధము. కదిపినఁగాని యెవరికి తెలియును? కుఱ్ఱవాఁడవయినను బుద్ధిమంతుఁడవు. అయితే నీవీగ్రామ మెందుకువచ్చినావు? ఇక్కడ బంధువులెవరు?

రామ—నాకందఱు బంధువులే. నేనీగ్రామమున కుపాధ్యాయుల విశ్వనాథశాస్త్రులవారు వచ్చియున్నారని విని యాయన దగ్గఱ చదువుకొనవలెనని వచ్చినాను. లక్ష్మీసహస్రము చదువుకొనవలెనని యున్నది. ఆయన చక్కఁగాఁ బాఠములు చెప్పఁగలరా?

శోభ—లక్ష్మీసహస్రమా? ఆలక్ష్మీసహస్రములు విశ్వనాథశాస్త్రులవారికి రావు. ఆయనకుఁ గావ్యపరిశ్రమమేకాని వైదికమునందుఁ బ్రవేశము లేదు. లక్ష్మీసహస్రనామములు, విష్ణుసహస్రనామములు మాగ్రామపురోహితుఁడైన సోమావధానులకు వచ్చును.

రామ—ఆపుస్తకము గూడ నొకకావ్యమే. సహస్రనామములు గావు.

శోభ—ఏమో! చిన్నపుడు కావ్యపంచకమువఱకుఁ జదువుకొన్నాను. వ్యవహారములోఁ బ్రవేశించినతరువాత తిరిగి యావిషయమై పనిచేయలేదు. అందుచేత జ్ఞాపకములేదు. ఆయన పాఠములు చక్కఁగాఁ జెప్పఁగలరుగాని నీవు బస యెక్కడచేయవలెనని యాలోచించినావు?

రామ—వంటపూఁటియింటనుండిచదువుకొనవలెనని యున్నది.

శోభ—ఏమియుసదుపాయముగా నుండదు. అందులో మా గ్రామములో నున్న వంటకూళ్ళముండ దిక్కుమాలినముండ. డబ్బు చేతిలోవేసికొని కడుపుగాల్చును. ఉన్నయి ల్లదియొకటే. అబ్బాయి! నీవు మాకుఁ గావలసినవాఁడవు. రెండుమూడుదినములు మాయింట నుండి తరువాత వంటకూళ్ళయింటఁ బ్రవేశించు. గ్రామములోనికివె ళ్ళుదము రా. ప్రొద్దుపోయినది.

రామ—మీయింటనెందుకు? వంటవూఁటయింట నే నీదినమే ప్రవేశించి చదువుకొనవలెనని యున్నది.

శోభ—నీకు మొగమోటముండఁ బనిలేదు. మాయిల్లు నీకత్యావశ్యకమైనచోటుగాని మఱియొకటికాదు. మనమందఱము నొకకంచము లో భోజనము చేయవలసినవాళ్ళము. లే. మూట పుచ్చుకో—

బంధువులు బలవంతము చేయుచున్నప్పుడు వారియింటికిఁ బో కుండుట బాగుండదని యాలోచించినను రామచంద్రుఁ డెన్నఁడును బర గృహనివాసముఁ జేయనందున మిక్కిలి యనిష్టముతోనే లేచి శోభనా చలముతోఁగూడఁ బోవుచు మార్గమధ్యమందు దా నీగ్రామము వచ్చి నవెంటనే గొప్పవారిస్నేహము దొరికినదనియుఁ దనకిది శుభసూచకమని యు సంతోషించుచుండెను. శుష్కప్రియములయందుఁ దనకుఁగల యా వత్తుసామర్థ్యము నుపయోగపఱచి, తనజన్మమధ్యమం దెప్పుడు లక్ష్మీ సహస్రమను కావ్యము పేరయిన వినకపోయినను, బంచకావ్యముల వఱకుఁ జదువుకొనకున్నను, దానుగూడ చదువుకొన్నవాఁడేయని రామ చంద్రుని మనస్సునకుఁ దోఁచునట్లు పలికెను. రామచంద్రునకుఁ దల్లి దండ్రులు లేరని విన్నప్పటినుండియు నీతనికి వంటవూఁటింటికి ధన మెట్లువచ్చునని పెద్దసందేహము, శోభనాచలమునుబట్టి బాధించుటచేత శంకానివృత్తి చేసికొనఁదలఁచి మెల్లగా నిట్లు ముచ్చటించెను.

శోభ—అబ్బాయి! వంటవూఁటిముండకు నెలకు నాలుగురూ పాయీలు దర్శించవలెనే. పాపము నీకుఁ దలిదండ్రులుకూడ లేరు. ఏలాగున చదువుకొందువో యని నాకు సందేహముగానున్నది.

రామ—అయ్యా! చేతులనున్న మురుగు లేఁబదిరూపాయీ లు విలువగలిగి యున్నవి. తమ్మంట్లు పాతికరూపాయీలు. ఆరెండును

విక్రయించినయెడల నొకసంవత్సరమువఱకుఁ జదువవచ్చును. 'సందో రాజా భవిష్యతి' తరువాత దైవమున్నాఁడు. నేనున్నాను. అప్పు డు ద్యోగస్థుల పిల్లలకుఁ బాఠమును చెప్పి యేమాత్రమైన సొమ్ము సంపా దింపఁగలనని నాకు ధైర్యమున్నది.

శోభ—సరే. చక్కని యాలోచన చేసినావు. చదువుకావలసిన వాఁడు సొమ్మే పావనముగాఁ జూచుకొనఁడు. చదువునం దాసక్తిగల వాని నిన్నొక్కనినే చూచినాను. కాని యీగ్రామమునందు కోమట్లు చెడ్డవాళ్ళు. మోసముచేసి వరహావస్తువు దమ్మిడీకిఁగొనఁగలసామర్థ్యము వారి దగ్గరనున్నది. పెద్దకోమట్లతో నాకుఁ బెక్కువ్యవహారములున్నవి. నేను వారిని మనయింటికిఁ బిలిపించి చక్కఁగా బేరముచేసినష్టము లేకుండ నీసొమ్ము నీకువచ్చున ట్లమ్మఁగలను. నీవు తొందరపడి సొంతముగా వ్యవ హరింపఁబోకు. ఇక్కడ తలలుదీసి తలలు బెట్టువార లున్నారు.

అని చెప్పఁగానే రామచంద్రునకు శోభనాచలముమీఁద మును పటికంటె నెక్కువనమ్మకము కుదురగా నాతనిసాహాయ్యముచేత నెట్లు యిన నాగ్రామమునందుండి సుఖముగాఁ జదువుకొనఁదలఁచెను. ఇట్లు వారిద్దఱు మాటలాడుచు గ్రామములోనికి వచ్చిరి. గ్రామమునకు వచ్చి రాజవీథిలోఁ గొంతవఱకుఁబోయి కుడిచేతిమీఁదుగా నున్న సందులో రెండు గుమ్మములుదాఁటి మూడవగుమ్మముదగ్గఱకుపోయి కొంచెము వెనుకగా వచ్చుచున్న రామచంద్రుఁడు వచ్చువఱకు నిలుచుండి 'ఇదే మనలోగిలి' అని చిన్నవీధియరుగులు కొబ్బరియాకులదడియును గల యొకపాత పెంకుటింటిలోనికిఁ దీసికొనిపోయి చావడిమీఁద నున్న తాటియాకుల చాపమీఁదఁ గూర్చుండుమని చెప్పి తాను లోపలికిఁ బోయి "అమ్మా" యని పిలిచి మెల్లగా నామెతో నిట్లని చెప్పెను.

శోభ—అమ్మా! నీవేమియు విసుగుకొనవద్దు. ఈవేళ మన యింటికి బంధువుఁ డొకఁడు వచ్చియున్నాఁడు. త్వరగా వంటకావలెను.

తల్లి—నీవేదో తెచ్చిపెట్టి నన్ను జంపుదువని నేనిదివఱకే యనుకొనుచున్నాను. నీకుఁ బ్రతిదినము నెవఁడో యొకబంధువు వచ్చు చునే యుండును. నీయుద్యోగమునకు నీసంపాదనకుఁ దోడు చుట్టాల నుగూడ దాఁపురముచేయవలెనఁటరా ? నాయనా !

శోభ——అబ్బా! ఊరకుండవమ్మా. అవతల పెద్దమనుష్యుఁడు కూర్చున్నాఁడు. పెద్దలేదు పిన్నలేదు. నీగోల యెప్పు డీలాగేయున్నది.

తల్లి——ఏమి యూరకుండను? ఎన్నాళ్లు? ఒకనాఁడా యొకకథా. ఎల్లకాలము నాకథ యీలాగే యున్నది. కాటికి కాళ్ళుజాఁచుకొన్న ముండను. చాకిరీ చేయలేక నానాహింసలు పడుచు నేలాగైన గంజికాచి పోయుదమని యనుకుంటే నీవు పేల్చుకొని తినుచున్నావు. ఎముకలు చిట్లకట్టి పోవుచున్నవి. రామ రామ! దిక్కుమాలిన దేవుఁడు నాకు చావు పెట్టఁడు. అఱువదియేండ్లువచ్చినందుకు సుఖములేదు; వల్లకాడు లేదు. తల్లికడుపునఁ బుట్టినదిమొదలు చచ్చువఱకు నొక్కటే మచ్చు గదా. ఇపు డత్తెసరు పెట్టవలెను. నీకేమి? మాటచెప్పఁగలవు.

అని తన్నుదాను దిట్టుకొనుచు, శోభనాచలమును దిట్టుచు, మరల బియ్యము కడిగి పొయ్యిమీఁదఁ బెట్టుటకుఁ బ్రయత్నముచేయు చుండెను. శోభనాచలమును దనతల్లియన్న మాటలను రామచంద్రుఁడు విన్నాఁడేమో యని భయముతో నీవలకు వచ్చెను. చావడిముం దున్న కొబ్బరియాకుల పందిరివలనఁ జల్లగానుండుటచేతను, మార్గా యాసనివారణము కాగా నేదో యోచన చేయుచు రామచంద్రుఁడు వీరికి జరిగినకలహము పూర్తిగ వినలేదుకాని కేకలుమాత్రము వినెను. శోభనాచలము రాగానే వారిద్ద ఱిట్లు మాటాడిరి.

రామ——అయ్యా! లోపల యెవరు కేకలు వేయుచున్నారు?

శోభ——ఏమిటో మాయమ్మ నల్లమందుపిచ్చిచేత నామీఁద నెప్పుడైనఁ గేకలు వేయుచుండును. అంతేకాని నీనామా టేదియు లేదే.

రామ——ఏదో వంటసంగతి యనుకొన్నానులెండి. అందుచేత నడిగినాను.

శోభ——ఆబిడ పెద్దది. పుట్టిబుద్ధియెఱిఁగినతరువాత నత్తెసరయినఁ బెట్టి యెఱుఁగదు. మాయాఁడువాండ్రు పుట్టినింటికివెళ్ళినారు. వంట బ్రాహ్మణుఁ డిదివఱకుండి వెళ్లిపోయినాఁడు. తిరిగి యెవ్వరినైన నేర్ప ఱచవలెననుకొన్నాను. ఎవరును కుదురరు. వాళ్ళకు బాగుగ సన్నము గలిగియున్నది.

రామ——అవును వంటబ్రాహ్మణులు దొరకుట కష్టమే.

ఇట్లువారిద్దఱు గొంతసేపు మాటాడుచుండిరి. తరువాత వంట దని తల్లి కేకవేయగా నిద్దఱునులేచి చెఱువునకువెళ్ళి స్నానము యిష్టగోష్ఠిని మాటాడుచు భోజనముచేసిరి.

---

## రెండవ ప్రకరణము.



భోజనములు కాగానే చేతులు గడుగుకొని చావడిమీఁద వారిద్దఱు కూర్చున్నప్పుడు శోభనాచలము తాంబూలముమాట జ్ఞప్తికి రాగా తమలపాకులును జెక్కలును లేకపోవుటచేతను గొప్పవారియింటఁ దమలపాకులుండకపోవునా యనియు నవి తనయింట లేనందునఁ దాను దక్కువవాఁడనియు రామచంద్రుఁ డాలోచించునేమో యని భయమును సందేహమును బొంది శోభనాచలము తాను నిరంతరము తాంబూలము వేసికొనునట్టి మహాసరసుఁడే యని బంధువునకు ధ్రువముగాఁ దెలియఁజేయుటకై యిట్లని చెప్పెను. "తమలపాకు లయిపోయినవి. చాకలివాఁడు వారముదినములక్రిందట సెలవుదీసికొనివెళ్ళి తిరిగి రాకపోవుటచేత సంతకుఁబోయి యాకులు తెచ్చువారు లేకపోయిరి. అది కాక మాయింటిది గ్రామమున నుండకపోవుటవలనఁ దమలపాకులమీఁది శ్రద్ధకూడతప్పినది. అది యున్నప్పు డాకులు చెక్కలు మాయింటి నిండ దొర్లుచుండును. ఉదయాస్తమయములు వచ్చినవారందఱు నములుచుండెడివారు." అనిచెప్పగా రామచంద్రుఁడు తమలపాకు లలవాటులేదని చెప్పి విశ్వనాథశాస్త్రులవారిదర్శనము త్వరితముగాఁ జేయవలయునని యుత్సాహముతో శాస్త్రులవారియింటికిఁ ద్రోవఁజూపుమనియుఁ, బూఁటకూళ్ళయిల్లు గ్రామమున కేప్రక్క నున్నదనియుఁ, దనదగ్గఱ నున్నవస్తువుల నమ్మివేయుటకుఁ గోమటిని బిలిపింపుఁడనియు రామచంద్రుఁడు శోభనాచలమును దొందరపెట్టెను. శోభనాచలమునకు వస్తువుల నమ్మివేయుటయందు రామచంద్రునికంటె నెక్కువయాత్రము కలిగియున్నది. కనుక శాస్త్రులవారియింటికి మఱునాఁడువెళ్ళవచ్చుననియుఁ బూఁ

యెడల నింక నెవ్వరికైనఁ జూపించుకొనుఁడు. నేను గీటురాయి మఱచి పోయినాను.

శోభ—గీటురాయి యెందుకయ్యా? అతఁడు నాణెముకట్టునట్లు మాగ్రామమునం దెవ్వరును గట్టలేరు. ఒకవేళ పొరపాటు వచ్చిన నతఁడు పారిపోవునా? నీవు పారిపోదువా? ఇచ్చినమట్టుకు సొమ్ము పుచ్చుకో. నిలకడమీఁదఁ జూచుకొనవచ్చును. పుష్యరాగములుకూడ విక్రయించవలెనని యున్నదా?

రాము—అవి యిపుడు విక్రయింపను. ఈరూపాయి లయిన తరువాతగాని చూపను. అయితే కనకరత్నము! నీ విపుడు రొక్కమీయఁగలవా?

కన—తక్షణము పుచ్చుకొండి. ముప్పదియైదురూపాయిలు నా దగ్గఱ నున్నవి. తక్కినరూపాయి తెల్లవారుజాము బంపించెద. అని లెక్క పెట్టి సొమ్మిచ్చెను. రామచంద్రుఁడు సొమ్ము పుచ్చుకొని బొడ్డు కొంగునఁ గట్టుకొనెను. అంతటఁ గోమటియు నింటికి వెళ్ళిపోయెను.

అపుడు రామచంద్రుఁడును శోభనాచలమును లోకాభిరామాయణమును జెప్పుకొనుచుండగాఁ బాతికిసంవత్సరములవయస్సుగల యొక కుఱ్ఱవాఁడు, రెండుభుజములమీఁదఁ గాయలు స్పష్టముగఁ గనుపడు చుండ, జుట్టును జుల్పములును నున్నగ దువ్వి, చేతిలో నొకపేపబెత్త ముబట్టుకొని, తలకు నుత్తరీయము కుచ్చువచ్చునట్లు చుట్టి, నోట నొక చుట్టను బెట్టుకొని కాల్చి గుప్పుగుప్పున పొగలువదలి చిన్న మేఘములను గల్పించుచుఁ, జేతిలో గుప్పెడాకులను జెక్కలను బట్టుకొని, నాగరకతయంతయుఁ దనమొగముననే తాండవమాడునట్లు లోపలికి వచ్చెను. లోపలికి వచ్చినయామనుష్యుని జూడఁగానే శోభనాచలమున కొకవిధ మయినతొందర కలిగెను. వచ్చినక్రొత్తమనుష్యుఁడు తనచంకక్రింద గుడ్డలోఁ జుట్టఁబడియున్న చీట్లపేకను దీసి చావడిమీఁద వేయగనే, శోభనాచలమునకుఁ దొందర యెక్కువై, మొగము వెలవెలబాఱి, రామచంద్రుఁడు తనలోఁ బ్రసంగవశమునఁ జెప్పుచున్నమాటలు వినఁబడకుండెను. అతఁడు వచ్చి కూర్చుండి చుట్టకాల్చుకొనుచుఁ, దమల పాకులతొడిమలు దీయుచు శోభనాచలమునకు లేశమయిన నిష్టము

లేకపోయినను నాతఁడు చేసిన కనుసంజ్ఞయైనఁ జూడక మాటలాడ నారంభించెను. ఈతనిపేరు నరసయ్య.

నర—"ఓరీ! శోభనాచలము! మనవాండ్రెవ్వరు రాలేదా? నీవు కూడ ముద్దులాగునఁ గూరుచుంటివేమి? దొడ్డిలోఁ జింతచెట్టుక్రిందఁ జాపలు వేయించినావా? నీపద్ధతిచూడగా నీవేళ యిక్కడనే యాడు టకు నిశ్చయించినట్లున్నది. ఏమి బెల్లముగొట్టినరాయిలాగున మాటా డవేమిరా?"

అనిక్రొత్తమనుష్యుఁ డిట్లు మాటలాడుచుండగా పంగనామములు బెట్టుకొని యింకొక బ్రాహ్మణుఁడు వచ్చి కూర్చుండెను. శోభనాచల మాతనిఁ జూడగనే "దయచేయండి. వెంకటరత్నముగారు" అనిపలుకరింపగా వెంకటరత్నము మిక్కిలి తెలివిగలవాఁడును, ప్రపంచ వ్యవహారములయం దారితేఱినవాఁడును గావున కడుమర్యాదగాఁ గూరుచుండెనుగాని తమలపాకులు వేసికొనుచు మొదటవచ్చిన బ్రాహ్మణుఁడు వెంకటరత్నమునుజూచి యిట్లు పలుకరించెను.

నర—ఏమిరో! వేంకటరత్నము! నీవుకూడ నింత యాలస్యముచేసినావేమి?

వేంక—ఈవేళ భోజనము ప్రొద్దువోయినది. వైశాఖపూజ చేసినాము.

నర—ఇది చైత్రమాసముగదా! వైశాఖపూజయేమిటి?

వేంక—ఏడ్చినావులే. నీవ్వూరకో. నీకేమియుఁ దెలియదు.

నర—మీయింట వైశాఖపూజ జరగిన శరభరాజుగారు నాకు వర్తమానము బంపరూ? మీయింట నేను రెండుకావిళ్ళ మంచినీళ్ళను మాత్రము పోసి వెళ్ళిపోయినాను.

వీరీప్రకారము మాటలాడుకొనుచుండగా మఱి నలువురు మనుష్యులు తటాలునఁ దలుపు దీసికొని వచ్చిరి. అందులో నొకఁడు శోభనాచలమును జూచి "ఓరీ! పిల్ల కుదిరినదఁట. సోమావధానులు చూచివచ్చినాఁడు" అనిచెప్పెను. అపుడు వేంకటరత్నము మొగము చిట్లించుకొని యాక్రొత్తమనుష్యునివైపు తిరిగి పండ్లుకొఱికి మాటాడ వద్దనిసంజ్ఞచేసి "మన మందఱము దొడ్డిలోనికిఁ బోదమురండి" యని

వారినందఱిని వెంటఁబెట్టుకొని యదివఱకే చింతక్రింద కమ్మకుట్టువాఁడు పఱచిన చాపలమీఁదఁ గూరుచుండి చీట్లపేక నాడ నిశ్చయించిరి. శోభనాచల మాదినమున రామచంద్రుఁడు వచ్చుటచేత నాటకు వెళ్ళక కూరుచుండెను. మెడలోఁ బిడికెడు యజ్ఞోపవీతము లుండుటచేత శోభనాచలమునకు వివాహమైనదని నమ్మియున్న రామచంద్రునకు నొకఁడు వచ్చి పిల్లకుదిరినదని చెప్పగానే శోభనాచలము చెప్పినమాటలయందును, వానిపెండ్లివిషయ మందును గొంచెము సందేహము కలుగుటయేకాక యతనియింటికి వచ్చి సంభాషించినవారి మాటలను బట్టి వీరందఱు వంటబ్రాహ్మణులు నీళ్ళబ్రాహ్మణులు మఱి యితరమైన నీచులనికూడ నాలోచన తోఁచి శోభనాచలము నడిగి చూడవలెనని బుద్ధిపుట్టెను. వారిట్లు మాటాడిరి.

రామ—ఏమండీ! ఆమొదటవచ్చినబ్రాహ్మణుఁ డెవరు?

శోభ—(విని వినుపించుకొననట్లు మనస్సులో నేదో యాలోచించుచుండెను.)

రామ—ఏమండీ! ఆమనుష్యుఁ డెవరండి?

శోభ—ఈగ్రామమునందు నీళ్ళబ్రాహ్మణుఁడు. (అని మెల్లగాఁజెప్పెను.)

రామ—అతఁడు పరువు మర్యాద లెఱుఁగకుండ మాటలాడినాఁడేమి?

శోభ—ఏమిటో చిన్నతనమునందు మేమిద్దఱము నొక బడిలోనే చదువుకొన్నాము. అప్పటి చనువుచేత నిప్పటికిని నన్నాలాగున నాతఁడు పిల్చుచుండును. స్నేహితులయెడ నా కంతపట్టింపు లేదు.

రామ—పిల్లకుదిరినదని యొకమనుష్యుఁ డన్నాఁడు. ఆపెండ్లి యెవరికి?

శోభ—నాకు వివాహ మనుకొన్నావా యేమి? మాపినతండ్రి కుమారునికి వివాహము కాలేదు. అతనివిషయమై పిల్లను వెదకఁ బంపినాను.

రామ—ఇప్పుడు వారందఱు దొడ్డిలో నేమిచేయుచున్నారు?

శోభ—చీట్లపేక నాడుచున్నారు. నీవుగూడ నాడఁగలవా?

రామ—నాకుఁ జేతగాదు. నే నాడఁదలంచుకొనను లేదు.

శోభ—ఆడిన తప్పులేదు. చేతగాకున్న నేర్చుకొనవచ్చును. డబ్బుపెట్టి యాడరు. ఒకవేళ సంతోషమునిమిత్తమాడినను దిరిగి యెవరిడబ్బు వారికే యిచ్చివేయుదురు.

రామ—అటువంటి యాటను నేను నేర్చుకొనను.

అని యిద్దఱు ప్రసంగము చేయునపుడు లోపల చీట్లపేకనాడుచుఁ గొంచెముధనము ఋణము కావలసి యొకస్నేహితుఁడు శోభనాచలమును నవలకుఁ బిలిచి ప్రస్తుత మాడుకొనుట కభ్యంతరము గల్గిన దనియుఁ, దానింటిదగ్గఱనుండి తెచ్చిన యిరువదియైదురూపాయిలు నోడిపోవుటచేతఁ బదిరూపాయి లప్పు కావలెననియుఁ జెప్పగా శోభనాచలము రామచంద్రునియొద్ద కాతనిఁ దీసికొనివచ్చి యాతఁడు మహాధనికుండనియు, సంవత్సరమున కతనికి వేయిరూపాయిలు భూములమీఁద వచ్చుననియుఁ జెప్పి తన నమ్మకముమీఁదఁ బదిరూపాయిలు ఋణమిప్పించెను. అప్పు దీసికొనుచున్న యామనుష్యుఁడు ధనవంతుఁడు గాకపోయినను, జూదరియు, నిర్భాగ్యుఁడు నైనను, శోభనాచలమున కతనియందుఁగల యభిమాన మతని విషయమై యంతచక్కఁగాఁ జెప్పునట్లు చేసినది. శోభనాచలము మాటలునమ్మి రామచంద్రుఁడు తాను దిగుచున్న మహావిపత్సముద్రము నెఱుఁగకయే కొంగునఁగట్టిన సొమ్ము విప్పి బిల్లకుడుములలాగున బదిరూకలు లెక్కపెట్టి చేతిలోఁబెట్టెను. రూపాయికి దినమున కొకయణా వడ్డీ యిచ్చెదనని చెప్పి యతఁడు సొమ్మును బట్టుకొనిపోయెను. మరికొంతసేపటి కామనుష్యుఁడే తిరిగి మఱియైదు రూపాయిల నిమ్మని యడిగి పట్టుకొనిపోయెను. ఇప్పటికి రామచంద్రుని యొద్ద నిరువది రూపాయిలుమాత్ర ముండును. శోభనాచలముగారి పెరటిలో జరుగుచున్న మహాద్యూతమునందు మొహిరీలు, వరహాలు, రూపాయిలు, అణాలు, డబ్బులు కూడఁ బందెములుగాఁబెట్టి, దారపుత్రాదు లన్నవస్త్రములులేక మలమల మాడుచు నిత్యశివరాత్రులును నేకాదశులును సలుపుచున్నను దానిని లక్ష్యపెట్టక, యహోరాత్రములు వేదాంతులవలె బంగారమును జిల్లపెంకులుగఁ జూచుచు వినో

దసముద్రమునందు మునింగి తేలుచున్న యనేకనలచక్రవర్తులును ధర్మ రాజులును నాచింతచెట్టుక్రింద గొలువు దీర్చియుందురు.

వారంద ఱాదినమ ట్లవిచ్ఛిన్నముగా జూదమాడుచున్న సమ యమునందు వాకిటంగూరుచున్న రామచంద్ర శోభనాచలముల కొక విధమైన యల్లరి వినంబడెను. అది వినంబడినతోడనే శోభనాచలమునకు మనసు తాళకపోయినందున వెంటనే యరంగుమీాందనుండి చివాలున నేల కుఱికి లోపలి కతండు పరుగెత్తికొనిపోవుచుండగా నీతని కెదురు గా పయిమీాంద బట్టలేక జుట్టుముడివిడిపోయి, వెక్కివెక్కి యేడ్చుచుం గుచ్ఛెళ్ళకొంగుతోం గన్నీళ్ళుదుడుచుకొనుచు, నొకపిల్లవాండు వచ్చె ను. అతనింజూచి రామచంద్రుండుకూడ లేచి పిల్లవాని యెదుటకుం బోయెను. అప్పు డాపిల్లవాం డిట్లుచెప్ప నారంభించెను.

" అయ్యా! ఈసంగతి మీారు వినుండి. నేను వీథిలో నుండి మాయింటికిం బోవుచుండగా నీకమ్మకుఱ్ఱవాండు నన్ను లోనికిం దీసి కొనిపోయెను. వేంకటరత్నముగారు నన్నుంగూడం జీట్లాడుమని బలవం తపెట్టిరి. ఒకటి రెండు పందెముల యందు నన్ను గెలిపించి తరువాత నాచేతి నున్న బంగారపు ముద్దుటుంగరమును బందెము బెట్టించిరి. పైమీాందనున్న జరీయుత్తరీయమును గూడ లాగుకొని నేనిమ్మనిగట్టిగా నడిగినప్పుడు నన్ను వీరందఱుం దిట్టి కొట్టినారు. ఇవిగో చఱపులు చూడండి. దెబ్బ లేలాగున నట్టలు కట్టియున్నవో. నేనిప్పుడు శరభరా జుగారియొద్దకుంబోయి యీసంగతిం జెప్పెదను." అని చెప్పుచున్న కుఱ్ఱ వానిమాట కడ్డమువచ్చి నరసయ్య మహాకోపముతో నిట్లనియెను.

నర—కాలుకూంతలు కుయ్యకు. చెప్పుదెబ్బలు తినంగలవు. శర భరాజుగారితోం జెప్పి తలంగొట్టి మొలవేయింపంగలవా యేమి? నీది క్కున్నచోట చెప్పుకో. అని శోభనాచలమువంకం జూచి 'యీతం డుం గరమును బెట్టుకొనిరాలేదు. ఉత్తరీయము నేను పుచ్చుకొన్నమాట సత్యమే. నాదగ్గఱ రెండురూపాయి లప్పుదీసికొని నాలుగునెల లయి నది. ఇంకను నీయలేదు. అందుచేత బట్ట లాగుకొన్నాను. ఇతండు రాను లేదు. ఆడను లేదు. అంతయు నబద్ధమే.'

ఇట్లిద్దఱు చెప్పగనే విని శోభనాచలము తనస్నేహితుల శక్తియు సాహసమును నెఱిఁగినవాఁడుగావున తప్పక వారాయుంగరము నప హరించి యుందురని నిశ్చయించి శరభరాజుగారిసంగతివిన్నపక్షమునఁ దనకు మాట వచ్చునని యేలాగైన నతనిసొమ్మతని కిప్పింపవలెనని నిశ్చయించుకొని బలవంతముగా రానికోపమును దెచ్చుకొని యీప్ర కారముగాఁ జెప్పెను.

శోభ—పుణ్యమునకుఁ బోఁగాఁ బాప మెదురైనదఁట. స్నేహి తులుకదా యని యాడుకొనుటకు స్థలమిచ్చినందుకు దెబ్బలాటలును, దుధకు నిష్ఠురములునా? నాయనా! నీసొమ్ము నాయింటఁ బోయినందు లకు నేనాదండుగ నిచ్చుకొందును. తెచ్చుకొన్నందుకుఁ జచ్చిన ట్లనుభ వింపవలెను. నాసొమ్మెందఱుతినుచుండుటలేదు? అందులో నీవొకఁడ వు. ఇంత మాత్రముతో నేను జెడిపోను. అని రామచంద్రునివంకఁ దిరిగి 'అబ్బాయి! నీదగ్గఱనున్న యిరువదిరూపాయిలు నాకు బదు లియ్యఁగలవా? సాయంకాలము తిరిగి నీ కిచ్చివేయుదును.'

రామ—చిత్తము. పుచ్చుకొనుఁడు. అనిచెప్పి యాసొమ్ము నంతను నిచ్చెను. ముప్పదియైదురూపాయిలు బదుళ్ళక్రిందనే యిచ్చి వేయుటచేత రామచంద్రునకు భార మంతయుఁ దగ్గిదేహము చులుకన యయ్యెను. ఆరూపాయిలు పుచ్చుకొని యాపిల్లవాఁ డుత్తరీయము గూడ మరల నరసయ్యయొద్దనుండి తీసికొని యింటికిఁ బోయెను. అప్పుడు సాయంకాల మగుటచే రామచంద్రుఁడు సంధ్యావందనమును జేసికొనుటకుఁ జెఱువునకుఁ బోఁగా వేంకటరత్నమును, శోభనాచల మును వానిని వెంబడించిరి. వేంకటరత్నము చెఱువుగట్టున నున్న యొకయింటఁ బ్రవేశించెను. శోభనాచలము మాత్రము చుట్టగాల్చు కొనుచు గట్టుమీఁదఁ గూరుచుండ రామచంద్రుఁడు సాంధ్యకృత్యము లయినతరువాత నతనితోఁ గలసి ప్రదోషకాలమున శివాలయమున కరిగి, యాలయముచుట్టును మూడుప్రదక్షిణములు చేసి, నందీశ్వరుని చెవులసందులనుండి ముందుగా నీశ్వరదర్శనము చేసి, గర్భగుడిఁ బ్రవే శించి తన కందకుండనున్న గంట నెగిరికొట్టి, శివునిదర్శించి "వందేశంభు మునూపతి" మ్మను శ్లోకమును బఠించి, పూజారి యిచ్చిన రుద్రపాద

ముల నందుకొని, మారేడుపత్రి నందితలనుంచి, విభూతి మొగమునఁ దాల్చి, కనుబొమ్మలసందున నమ్మవారి కుంకుమను బొట్టుపెట్టుకొని, యీశ్వరప్రసాదమును దినఁగూడదుగనుక కొబ్బరిముక్కల నక్కడ నుంచి, కొంతసేపటఁ గూరుచుండి యింటికి శోభనాచలముతోఁ గలిసి వచ్చునప్పటికి భోజనపువేళ యయ్యెను.

తనయదృష్టముపుచ్చి రామచంద్రుఁడు వచ్చుటచేతఁ దనకు మారుని వలనఁ దగిలెడుదెబ్బలు తప్పినందులకు సంతోషించుచు, నల్లమందు లేకపోవుటచేతఁ గాళ్ళు లాగుచున్నందున వంటమాత్రము చేసికొని శోభనాచలముతల్లి పరుండెను. శోభనాచలము వచ్చి తానే యన్నము వడ్డించి రామచంద్రునితోఁ గలసి సుఖముగా భోజనము చేసెను. భోజనముగువఱకు వేంకటస్వామి వచ్చి సిద్ధముగా నున్నందున శోభనాచలము వాని నక్కడనే పండుకొనుమని సహాయార్థ ముంచుకొనెను. రాత్రి జామయినతరువాత రామచంద్రునకు నిద్రపట్టెను. కొంతసేపటి కందఱు బుసకొట్టి నిద్రపోవుచుండిరి కాని వేంకటస్వామికి మాత్ర మేకారణముననో నిద్రపట్టదయ్యెను. తరువాత రెండుజాముల వేళ నేల గొట్టినట్లు చప్పుడయ్యెను. ఏదో స్వప్నమువచ్చి మెలఁకువగల్గి నరామచంద్రుఁ డాచప్పుడువిని 'యెవరువారు?' అని కేకవేసెను. ఆకేక వేయగనే యాచప్పు డాగిపోయి మరల రెండుగడియ లయ్యెను. అప్పటికి రామచంద్రుఁడు గాఢముగ నిద్రించుచుండెను. అప్పు డొక దొంగ చప్పుడుగాకుండ మెల్లమెల్లగా నడుగులఁ బెట్టుచు రామచంద్రునియొద్దకువచ్చి, తలవైపునఁ గూర్చుండి తమ్మంట్లు దీసికొని దురాశచేత, శోభనాచల మిదివఱకే రూపాయి లన్నియు క్షౌరముచేసినాఁడన్న మాట నెఱుఁగక, తలక్రిందిమూటలో నేమో యున్నదనుకొని మెల్లగ మూట లాగెను. మూటలాగగనే తల భూమిమీఁదఁ బడి టక్కున దగులుటవలన మెలఁకువ వచ్చి రామచంద్రుఁడు తలయెత్తి చూచి 'దొంగ దొంగ' యని కేకవేసెను. వెంటనే దొంగ మూఁట బారవైచి యేమూలకో పారిపోయెను. రెండుమూడు పిలుపులు పిలిచినతరువాత శోభనాచలములేచి దొంగలుపడినందున కాశ్చర్యపడి దీపము వెలిఁగించి

కట్టి పుచ్చుకొని యిల్లు నాల్గుమూలలు వెదకెను గాని వానికెక్కడను దొంగ కనఁబడఁడయ్యె.

కమ్మకుఱ్ఱవాఁడు మాత్ర మీకేకలు వినఁబడక కాఁబోలు, చెమట పోయుచున్నను ముసుఁగుబెట్టికొని పండుకొనెను. రామచంద్రుఁడొక్కఁడు పండుకొనుటకు భయపడునేమోయని, కాఁదలఁచినపని కొంచెమైనది కనుక శోభనాచలము రామచంద్రునిమీఁద నతిదయగలిగి దగ్గఱగాఁ బండుకొనెను. రూపాయిలు శోభనాచలము దగ్గఱనుండుటచేతను, తమ్మంట్లు దొంగిలెత్తుకొనిపోవుటచేతను, రామచంద్రునకు భయపడవలసిన యావశ్యక మంతయుఁ బోయి సుఖముగా నిద్రపట్టెను. కాని మధ్య మధ్య స్వప్నములు, పలవరింతలు, నాతనినిద్రకు నంతరాయములు గల్పించుచుండెను. మురుగుల నమ్ముకొనుటచేత వచ్చినసొమ్ముతోఁ గొంతకాలక్షేపము చేయవచ్చునను ధైర్యమునఁ దమ్మంట్లుపోయినవిచార మంతగా రామచంద్రున కగుపడలేదు. వయస్సునందు బాలుఁడయ్యుఁ, దెలివితేటలం దసమానుఁడైన యాకమ్మకుఱ్ఱవాఁడే రామచంద్రుని తమ్మంట్లబాధ వదలించిన సాహసవిక్రమార్కుఁడని చెప్పనక్కఱలేకయే మీరు తెలిసికొనవచ్చును. జూదరియు, వంచకుఁడును, ద్రోహియునగు నీశోభనాచలము రామచంద్రుని తండ్రియగు శ్రీరాములుగారి నెఱుఁగకపోయినను నెఱిఁగినట్లుచెప్పి, నిరక్షరకుక్షియయ్యుఁ గావ్యపంచకమువఱకుఁ జదువుకొన్నట్లు చెప్పి, పరమనీచుఁడయ్యు గొప్పవారికి బంధువుఁడనిచెప్పి, బ్రహ్మచారియయ్యు గృహస్థుండనిచెప్పి, మోసముచేసి, రామచంద్రునిఁ దనయింటికి రప్పించుకొని చేయఁదలంచిన పనినంతయుఁ జేసి సగలమునోరఁగుండై యారాత్రి కమ్మవానిచేత దొంగతనము చేయించి, తమ్మంట్లు తానే యపహరించి మిగిలిన రాత్రియంతయు సుఖముగా నిద్రించెను. మద్దుల కనకరత్నమును శోభనాచలమున కేవిషయమునను దీసిపోనివాఁడే కనుక యేఁబదిరూపాయిల విలువగల మురుగులను ముప్పదియాఱు రూపాయిలకే తీసికొని యందులో నొకరూపాయి సరువు పెట్టి తనచేత నయినంతవఱకుఁ

డానును రామచంద్రుని వంచించెను. అందఱు నుదయమునందు లేచి కాల్యకృత్యములు నిర్వర్తించుకొనిరి.

---

## మూడవ ప్రకరణము.



ప్రాతఃకాలమందుఁ గాల్యకృత్యములు నిర్వర్తించుకొని విశ్వనాథశాస్త్రులవారి దర్శనము చేయుటకుఁ బోవలయునని రామచంద్రుఁడు శోభనాచలమును గూడ రమ్మనియడుగ నతఁడు వచ్చుటకు వీలు లేదనియు, శాస్త్రులవారు మిక్కిలి మంచివారనియు, స్వయముగానే వెళ్ళవచ్చుననియుఁ జెప్పి వారియింటికి మార్గమును జూపుటకు మాత్రము వేంకటస్వామిని జత యిచ్చెను. అతఁడును రామచంద్రుని వెంటఁబెట్టుకొని శాస్త్రులవారి యిల్లు చూపి పోయెను. విశ్వనాథశాస్త్రులవారి యిల్లు రాజవీథిలో నున్నది. విశాలముగా నున్న రెండువీథియరఁగుల మీఁదఁ దాటియాకులచాపలు వేయఁబడి యున్నవి. ఆచాపలమీఁద విశ్వనాథశాస్త్రులవారి విద్యార్థులందఱుఁ గూరుచుండియుండిరి. అందులోఁ గొందఱు తొమిదివఱకుఁ జదువుకొన్న పాఠములఁ జింతన చేసికొనుచుండిరి. కొందఱు ముందు చెప్పుకొనవలసిన పాఠములను జూచుకొనుచుండిరి. కొంద ఱాకును గంటమును బుచ్చుకొని క్రొత్తపుస్తకములఁజూచి ప్రతులు వ్రాయుచుండిరి. ఉదయమునందే స్నానముచేసి, విభూతిపెండెకట్లు బెట్టుకొని, మొగలితుఱ్ఱు సంస్థానమునం దష్టావధానము జేసినపుడు మహారాజుగారిచ్చిన పట్టుసేలువ మీఁదఁ గప్పుకొని బరువైనబంగరు కుండలములు చెవులను గ్రిందకు దిగలాగుచుండ విశ్వనాథశాస్త్రులవారు గోడకుఁ జేరగిలఁబడి కొంచెము తలవంచి కన్నులకు సులోచనములు బెట్టుకొని ప్రాఁతదగుటచేత నక్షరము లగుపడకున్నందున శిష్యుఁడొకఁడు మధ్యమధ్య పత్రములకుఁ గాకరపసరు రాయుచుండఁ దాటియాకులపుస్తక మొకటి చదువుచుండెను. శాస్త్రులవారి కిప్పటికిరమారమి యేఁబది సంవత్సరము లున్నందున దల కొంచె

ము నరసియుండెను. ముసలితనమైనను సుందరముగా దార్ఢ్యముగా నున్న యాయన శరీరమును జూచినవారందఱు పడుచువానికంటె నాయన స్ఫురద్రూపియై యుండునని యనుకొనక మానరు. రామచంద్రుఁడక్కడకుఁబోగానే శిష్యులందఱు నితని నెగాదిగఁజూచి తమలోఁ దాము ముసిముసి నవ్వులు నవ్వుకొనుచుండిరి. రామచంద్రుఁడువచ్చి శాస్త్రుల వారికి నమస్కారము చేయ నాయన యాతని దీవించి కూరుచుండుమని చెప్పెను. కూరుచున్న తరువాత రామచంద్రుని సంగతులన్నియు నడిగి యాతఁడు తమదగ్గఱ చదువుకొనుటకు వచ్చినాఁడని తెలిసికొని శాస్త్రులవారు సంతోషించిరి. అంతట నొక శిష్యుఁడు రామచంద్రునితో ముచ్చటింపఁ దలఁచి యిట్లు సంభాషించెను.

శిష్యు—అయ్యా! తమ రెంతవఱకుఁ జదువుకొన్నారు?

రామ—కావ్యపంచకమువఱకుఁ జదువుకొన్నాను.

శిష్యు—ఎంతకాలమయినది కావ్యము లారంభించి?

రామ—మూడుసంవత్సరములైనది. ఇంక నేమాత్రమో కొన్ని నెలలు తక్కువే.

శిష్యు—ఏమి బడాయ లయ్యా! ఎన్నఁడుఁ గావ్యముల ముఖ మెఱుఁగనివారిదగ్గఱ చెప్పినట్లెచెప్పుచున్నావు. నీవెంత తెలివిగలవాఁడవైన నేఁడాది కొక కావ్యము కంటె నెక్కువ చదువఁగలవఁటయ్యా! నీవే చదువుకొన్నావా? ఇంకెవరు జదువుకొనలేదా? మేము నీవలెఁ దెలివిగలవారము కాకపోయినను కొద్దిగొప్ప చదువుకొన్న వారమే.

రామ—నేనబద్ధములు చెప్పుచున్నా ననియా మీ యభిప్రాయము. మూడు సంవత్సరములలోఁ గావ్యములు చదువుకొనుట యొక వింతటండీ! నేనీలాగున జదివినాను.

శిష్యు—మీరు కాదుగదా బ్రహ్మరుద్రులైననుసరే యేఁడాది కొక్కటి చదువునప్పటికిఁ జచ్చిచెడిచేయంగలవిన్నపములగును. మాటలండీ మాగ్రామమునందు బ్రాహ్మణుఁ డొకఁడు నవద్వీపము వెళ్ళి యిరువదినాలుగు సంవత్సరములు వ్యాకరణశాస్త్రము చదివినాఁడు. ఇంకను గ్రంథము తరువాయి. నీ వాకాశమునుండి యూడి పడినావా యేమిటి? అయితే దినమున కెన్ని శ్లోకములు చదివెడువాఁడవు?

రామ—పది, యెనిమిది యీప్రకారముగాఁ జదివెదువాఁడను.

శిష్యు—గుండె చేతితో బాఁదుకొని 'అబ్బా! లోకములో లేనివింత. నీతలమీఁద దాఁటి కొమ్ములు దిరిగినవారైనను రెండు మూడు శ్లోకముల కంటె నెక్కువ చదువలేదు.' అని శాస్త్రులవారి వంకఁజూచి 'యేమండీ శాస్త్రులవారు! ఇతనిమాటలు చిత్తగించినారా?'

విశ్వ—ఆశ్చర్య మేమున్నది? కుశాగ్రబుద్ధు లున్నపక్షమున నట్లె చదువఁగలరు. ఇట్లు వారు సంభాషించునప్పటికి జాముప్రొద్దెక్కఁగాఁ గొందఱు శిష్యులు మాధుకరమునకును గొందఱు వారములకును గొందఱు పూఁటకూళ్ళయిండ్లకును బోయిరి. రామచంద్రుఁడు శాస్త్రులవారిదగ్గఱ సెలవుపుచ్చుకొని శోభనాచలమునుదీసికొని పూటకూళ్ళయింటికిఁ బోయెను. ఆ పూఁటకూటియింటియరఁగుమీఁద భోజనార్థమువచ్చిన కొందఱురాజులును బ్రాహ్మణులును గూరుచుండిరి. లోపల నడవలోనున్న దండెమునకుఁ బట్టుబట్టలు వరుసగాఁ జుట్టఁబడియుండెను. ఉదయాస్తమయములు తడికాళ్ళతో మనుష్యులు తిరుగుచుండుటచేత నిల్లంతయుఁ దేమగలిగి కొంచెము జారుగానుండెను. చేతులను బోచీలును, మురుగులును, బంగారుతీఁగెలువేసిన రాగిపట్టెలును మెడలోఁ బలకసరులు, పట్టెడ, నానుఁగలిగి చలువచేసినజరీపంచె శరీరమంతయుఁ గనుపడునట్లు గట్టి, జుట్టు సిగముడివేసి, యింటఁ గొందఱికిని వాకిటఁ గొందఱికిని వడ్డించుచు, భోజనముచేసినవారిచ్చుచున్న డబ్బుల నెడమచేతఁ బుచ్చుకొనుచు, మిక్కిలి పనితొందరచే నూపిరియాడక తిరుగుచున్న యొక తలవెంట్రుకలవిధవను జూచి, శోభనాచలము "రాజమ్మా! బాగున్నావా! ముసలాయన యేమైన దార్ఢ్యముగాఁ దిరుగుచున్నాఁడా?" యని పలుకరించెను.

రాజ—తమదయవల్ల బాగున్నాము. మానాన్న మునుపటివలెనే తిరుగుచున్నాఁడుగాని దగ్గుమాత్రము వదలలేదండి, ఏమి యీవేళ మామీఁదఁ గటాక్షము వచ్చినది?

శోభ—మరేమిలేదు. తాటిపాకనుండి మనమాచిరాజువారి చిన్నవాఁడు వచ్చినాఁడు. అతనికి మీయింట నుండవలెనని యున్నది. అతని నిక్కడ నప్పగించుటకు వచ్చినాను. పిల్లవాఁడు మిక్కిలి బుద్ధి

మంతుఁడు. ఈకాలపుఁబిల్లలవలె నల్లరచిల్లరవాఁడు గాఁడు. నీవంటతి నొకయెత్తు నీపిల్లవాని నొకయెత్తుగాను జూడవలెను. ఇతఁ డొకరిజో లికి పొంటికిఁ బోవువాఁడు గాఁడు. తన చదువేమో, తానేమో.

రాజ—దాని కభ్యంతర మేమి? తమ రింతదూరము శ్రమపడి రావలెనా? ఆపిల్లవానికి మఱొక లోపము రాకుండ జాగ్రత్తపెట్టు భారము నాది.

శోభ—రూపాయి లతని నడుగవద్దు. నెలకాగానే నే నిచ్చి వేయుదును. ఇంక వంట యెంత యాలస్యముగా నగును? నాలుగు గడియలకు రావచ్చునా?

రాజ—అక్కఱలేదు. రెండు గడియలలోగా రావచ్చును. స్నానము చేసిరా నాయనా!

అప్పుడు శోభనాచలమును, రామచంద్రుఁడును వెళ్ళిపోయిరి. రాజమ్మది పూర్వము పలివెల నివాసస్థలము. ఆమె పెనిమిటి వివాహమైన రెండుమాసములకే కాలధర్మము నొందుటచేతను బుట్టినింటివారి సంసారము చితికిపోవుటచేతను రాజమ్మ తల్లిని, దండ్రిని, దమ్మునిఁ దీసి కొని యమలాపురము వచ్చి యచట పూఁటకూళ్ళను బెట్టుచు నహో రాత్రములు వేసెడువిస్తర్రి వేయుచుఁ దీసెడివిస్తర్రిఁ దీయుచు, వంటలు చేయించుచు వచ్చినవారికి వడ్డించుచుఁ గాశిలోనున్న యన్నపూర్ణ సత్రము నందువలె నిరంతరాన్నదానము చేయుచు నమలాపురమునం దేకాక కోనసీమయం దంతటను మహాప్రసిద్ధికెక్కి విస్తారము ధనము నార్జించెను. పూఁటకూళ్ళను బెట్టుటకారంభించి మూడుసంవత్సరము లైనను బండ్రెండువందలరూపాయాల నార్జించెను. ఆమె మొదట నాగ్రామము వచ్చినపుడు వండుటకుఁ బాత్రసామగ్రియైన లేనియిల్లు గంగాళములు మొదలయినవానితో నిండియుండగా మొదట కేవలము రాగిపట్టెలయిన లేని రాజమ్మశరీరము బంగారపు నగలతో నిండియుం డుట యొక యాశ్చర్యముగాదు.

పాపము! దైవ మోర్వజాలక యామెకు వైధవ్యమును దెచ్చి పెట్టి మనసువచ్చినన్ని నగలు పెట్టుకొనుట కభ్యంతరము గల్పించినాఁడు గాని లేనిపక్షమునఁ బుణ్యస్త్రీలుపెట్టుకొను నగ లన్నియుఁ బెట్టుకొను

టకామె దగ్గఱ సామర్థ్యమున్నది. ధనము హెచ్చినకొలఁది సుకుమారముకూడ హెచ్చినందున రాజమ్మ వంటచేయుట కష్టమనితోఁచి యొకవంటబ్రాహ్మణునిఁ బెట్టెను. మొదటవచ్చినపుడు రాజమ్మతండ్రి పెసరట్లనమ్ముటచేతను, దల్లి నీళ్ళబిందెలు మోయుటచేతను, దమ్ముఁడు చలిపందిరిలో దాహమునకు నీళ్ళిచ్చుటచేతను, దాను బూఁటకూళ్ళు పెట్టుటచేతను సంపాదించిన ద్రవ్యముతో రాజమ్మ యిపుడు వడ్డీవ్యాపారము చేయుచుండును. మొదట నందఱిని బ్రతిమాలి కాలక్షేపము చేయుచుఁ గొంతధనము చేతఁజిక్కగనే గర్వించి మనుష్యులను రాజమ్మ నిరాకరింపఁ బ్రారంభించెను. ఇంటికి రాజమ్మ పెద్దాఁడుపడు చగుటచేతఁ దలిదండ్రులును దమ్ముఁడును నామెయడుగు దాఁటక యామెపేరు చెప్పిన గడగడవణఁకుచుందురు. తనయొడల నాలుగయిదువందల రూపాయిల నగలఁబెట్టుకొని, తమ్మున కైదువందలిచ్చి పెండ్లిచేసి తామున్న యింటివారికి నూఱురూపాయి లింటిమీఁద బదులిచ్చి తరువాత నింకొకమాఱేఁబదిరూపాయిలు వారిచేతిలోఁ బెట్టి యాయిల్లు కొనెను. రాజమ్మ సంగతి యటుండనిచ్చి యింకఁ గథారంభము చేయుదము. తరువాత రామచంద్రుఁడు స్నానముజేసి మడి గట్టుకొనగా భోజనము లారంభమాయెను. ఆసమయమునందు రాజమ్మ వడ్డన చేయుచు రామచంద్రుని వృత్తాంతమును దెలిసికొని యతఁడు నియోగియని చెప్పినతరువాత నిట్లుమాటలాడ నారంభించెను.

రాజ—మొగమోటపడకు నాయనా! నియోగపు బిడ్డవు. కొంచెము పరువుప్రతిష్ఠలకు దేవులాడువారు మన నియోగులే. మేముగూడ నియోగులమే యనిచెప్పుటకు నీవంటివారిదగ్గఱ సిగ్గుగా నుండును. సగముచచ్చిసుఁడీ యీపనిఁ జేయుచున్నది.

రామ—అవును. కాలము తప్పివచ్చినపు డేమిచేయఁగలము?

రాజ—నీవు చెప్పిన నమ్ముదువో లేదోకాని మాసంసారస్థితి, యేఁబదియావులపాడి. కావలసినంత ధాన్యపుఁబంట. ఏవస్తువుకైన, నొకరియింటికి వెళ్ళనక్కఱలేకుండఁ గాలిమీఁదఁ గాలువేసికొని కూర్చున్నవాళ్ళము. ఇవతలచెం బవతల బెట్టి యెఱుఁగనుసుమీ. ఆలాటి దానిని,మాయశక్తి యెక్కడనుండి వచ్చినదో బిందెలకుబిందెలు దించు

చున్నాను. నేఁటికాలమున కింతకర్మమును దెచ్చిపెట్టినావా దైవమా యని పొట్టకోసర మీపనిఁ జేయుచుఁ దగుదునమ్మా యని తిరుగు చున్నాను. ఎంత సుకుమారముగఁ బెరిఁగినానో యంతకష్టము వచ్చినది.

రామ—నియోగు లిటువంటిపనిఁ జేయవలసినపక్షమున కష్టము గానే యుండును.

రాజ—కూచిమంచివారు, మాచిరాజువారు, మంత్రిప్రగడ వారు మాకు బంధువులే. వారెవరైనఁ గంటఁబడినప్పుడు ప్రాణము చచ్చినట్టుగానుండును. ఇప్పుడయిన నొకడబ్బుసొమ్ము మిగిలించుకొన వలెననిలేదు. వాళ్ళడబ్బు వాళ్ళకుఁబెట్టి యేలాగుననైన మాట దక్కిం చుకొనవలెనని యుద్దేశమే.

ఇట్లువారు మాటాడుకొనునప్పటికి భోజనమునకు మఱికొంద ఱువచ్చి చిరకాలముక్రిందటఁ దడిపినపట్టుబట్టలఁ గట్టుకొని యన్నముఁ దినుచుండిరి.

ఒకమనుష్యుఁడు—రాజమ్మగారూ! కొంతయన్నము చల్లగాను, గొంతయన్నము వెచ్చగా నున్నదేమండీ? పొడియన్న మేమయినఁ గలసినదాయేమి?

రాజ—ఊరకోవయ్యా! ఎవరయినను మీమాటలకు నవ్వు దురు. అన్నము చల్లారినదేమో.

రెండవ—పప్పులో గంజివాసన వేయుచున్నట్లు కనఁబడుచు న్నదేమి?

రాజ—మీకుఁ గొంచెము రొంపపట్టినదేమో. పప్పులో గంజి వాసన యేమిటండీ.

మూఁడవ—ఏమిటండీ! అవతల రాజులకువడ్డించగా మిగిలిన యన్నము మాకు వడ్డించినారేమండీ? అంత బొత్తుగా మాలకూఁడా! కొంచెము కుడి యెడమ వద్దటండీ!

రాజ—చాలు లేవయ్యా! నేర్చుకొనిపోయినావు. నీమాటలు నీవు సరే. నీవే యాచారవంతుఁడవా? ఇవతలివాళ్ళే యంతమాల కూడుతినువాళ్ళా? నేనింటనుండి పళ్లెము దెచ్చి వడ్డనఁ జేయుచున్నందు కా యీలాటిమాటలు.

నాల్గవ—అన్నట్టు జ్ఞాపకమువచ్చినది. రాజమ్మగారూ! మీమ అఱదిభార్య ప్రసవమైనదఁట. పురుడు వెళ్ళలేదుగదా! మీరు మడి గట్టుకొన్నారేమి?

రాజ—అయ్యో! మాకు వారికిఁ దరములు తప్పిపోయినవండీ.

నాల్గవ—మఱదికి మీకుఁ దరము లేలాగునవిడిపోవునండీ! జ్ఞాతులు గనుకనా?

రాజ—పురిటిదినములు వెళ్ళిపోయినవి.

నాల్గవ—ఈవేళకుఁ దొమ్మిది. శుద్ధిస్నానము కాలేదు. రామ రామ. పురిటికూడు దినినందుకు రేపందఱము స్నానము చేయవలెను. మీరెప్పుడు నీలాగే. వెనుక చద్దియన్నముఁ బెట్టుమన్నపుడు మైలబట్టతోనే పెట్టినారు. ఈయాచార మెక్కడను జూడలేదు.

మొదటి—పచ్చడిలో మెతుకులు కనఁబడుచున్న వేమండీ?

రెండవ—ఇందాఁక నెవరో దిగఁబెట్టినపచ్చడి వేరేతీసి దాఁచుచుండగా నేను జూచినాను. అది పొరపాటుచేత నీకుఁ బడినదేమో.

మొదటి—నారాయణ! నారాయణ! ఎంగిలికూడ నెక్కడ తినఁగలమమ్మా. ఛీ! నాకీయన్నముఁవద్దు. (అని యాపోసనముపట్టి లేచి పోయినాఁడు.)

రాజ—కోపముతో వెళ్ళవయ్యా గడియగడియకు బెదరించి యెంతకాల ముండఁగలవు? పాపము! పొరుగూరినుండి వచ్చినారు, తల్లిదండ్రు లెవరు దగ్గఱలేరుగదా యని సమస్తసదుపాయములుచేసి సొంతయింటికంటె నెక్కువ యాదరణ చేయుచున్నందుకా మీ రీలాగునఁ జెవులుపట్టుకొని యాడించుట? పైపైనున్నది. మనమాటలు పడునని మీరనుకొనుచున్నారు కాఁబోలు. నేనాలాగున మాటలు పడుదానను గాను. మీయిష్టమయిన నుండుఁడి, కష్టమయినపక్షమున వెళ్ళండి. నావంటివారు లక్షమంది మీకున్నారు. మీవంటివారు లక్షమంది మాకున్నారు. మా తెక్కలు చల్లగా నున్నంతసేపు భయములేదు. ఇప్పటికయినది లెక్కచూచి యిచ్చి మఱీ వెళ్ళండి. అందాఁకఁ బట్టుపంచె పట్టుకొని వెళ్ళవద్దు.

నాల్గవ—సరే! ఉంచుకొనుఁడి పట్టుపంచె. నాకు భయములేదు.

రాజ—అవతలవీధి నున్నముండ డబ్బులు పుచ్చుకొని కడుపుఁ గాల్చెడిది. అదే మంచిది. పరమార్థ మాలోచించెడు మావంటి పరువుగలవారలకుఁ గాలముగాదు. వాండ్ర దగ్గఱ నోరే యెత్తరు. ఆమాయముండ కేలాగున డబ్బు దక్కునో తెలియదమ్మా.

అని యనగానే పట్టుపంచె వదలి యతఁడు పోయెను. రామచంద్రుఁడును భోజనానంతరము పాఠశాలకుఁ బోయెను. శిష్టాచారసంపత్తిగల సాంప్రదాయమునందుఁబుట్టిన రామచంద్రుఁడు పూఁటకూటియింట బొట్టుఁ బెట్టుకొనక, కాళ్లుఁ గడుగుకొనక మడిబట్టలఁ గట్టుకొనక భోజనము చేయువారలను జూచి పట్టణవాసములయందుఁ గల వైచిత్ర్యముల కాశ్చర్యము నొందెను. అంతతో నతని యాశ్చర్యము సమాప్తము నొందక రాజమ్మ చర్యలు, భోజనమునకు వచ్చినవారి సంభాషణలు విన్నపిదప నధికమాయెను. రామచంద్రుఁ డాదినము మొదలు విశ్వనాథశాస్త్రులవారి యింటనే పండుకొనుచు నచటి సహాధ్యాయులతో సుఖముగాఁ గాలముగడుపుచుండెను. ప్రతిదినము మధ్యాహ్నము భోజన మైనతరువాత శాస్త్రులవారు గేదెకు గడ్డినిమిత్తము పొలమునకుఁ బోయినప్పుడు గురుశుశ్రూషయం దొకరికంటె నొకరు మించవలెనని పనిఁ జేయుచున్న శిష్యులతోఁ గలసి, శాస్త్రులవారికిఁ దనచేతఁ బని చేయించుట కిష్టము లేకున్నను, దానుగూడ శక్తిలోపము లేక శుశ్రూష చేయుచుండెను. విశ్వనాథశాస్త్రులవారికి రామచంద్రునిమీఁదఁ గల మంచి యభిప్రాయ మంతకంతకు హెచ్చెను. జనమనోహరమయిన యాకారమును, నాకారమునకుఁ దగిన బుద్ధిసంపదయు, బుద్ధిసంపద కనుగుణ మయిన విద్యాసక్తియు, విద్యాసక్తికలంకారముఁ బెట్టుచున్న వినయసంపత్తియు నర్జునునియందు ద్రోణాచార్యునకువలెనే రామచంద్రునియందు విశ్వనాథశాస్త్రులవారికి మంచి ప్రేమను గలిగించెను. శాస్త్రులవారి యింటియెదుటనే గ్రామమునందెల్లఁ దగు పెద్దమనుష్యులును సంపన్నగృహస్థులు నయిన మంత్రిప్రగడ శరభరాజుగారియిల్లు గలదు. ఆయనకుమారుఁడె రామచంద్రుని యీడు గలవాఁడు శాస్త్రులవారి దగ్గఱ చదువుకొనుచు రామచంద్రుని సవర్తనమునకును, బుద్ధికిని సంతోషించి యతనితో స్నేహముచేసి యతఁ

డెక్కడనుండిన దానక్కడనుండుచు, నీతనికేలోపము తటస్థమయినను సహాయము జేయుటకుఁ దాను సిద్ధముగా నుండి యతని నతిగౌరవముతోఁ జూచుచుండెను. వారిద్దఱును గృష్ణార్జునుల వలె నతిశయస్నేహముచేతఁ బ్రసిద్ధికెక్కిరి. సహజముగా మంచిశారీరముగల రామచంద్రునకు రాగజ్ఞానము వన్నెతేఁ బుస్తకము నతిశ్రావ్యముగాఁ జదువఁగలుగుటచేత శరభరాజుగా రప్పుడప్పు డతనిని బిలిపించి పుస్తకముఁ జదివించుచుందురు. పుష్పసౌరభ్యమువలెనే వ్యాపించిన రామచంద్రుని కీర్తి వలన నతనియందు మంచియభిప్రాయముగల శరభరాజుగారి మనస్సునకు, విశ్వనాథశాస్త్రులవారును, గుమారుఁడును జేయు న్యాయమైన స్తుతులు చక్కగా నాటి పిల్లవానియం దొకవిధమైన యనురాగమును గలిగించెను. ఇది యిట్లుండగా రామచంద్రుఁడు పూఁటకూటియింటఁ బ్రవేశించి రెండుమాసను లయినది. ఒకపర్యాయము రాజమ్మ లెక్కకుఁ దొందర పెట్టగా శోభనాచలము రెండురూపాయిల నిచ్చెను. కాని తరువాత నొక దమ్మిడి నయిన నియ్యలేదు. తరువాత రామచంద్రుఁడు తన సహాధ్యాయునియొద్ద రెండురూపాయిలు బదులుచేసి రాజమ్మ కిచ్చెను. ఇట్లు రాజమ్మ కొకమాసపు సొమ్ముమాత్రము ముట్టినది గాని రెండవమాసపు సొమ్ము ముట్టనందున నామె రామచంద్రుని నిలువ నీయక బాధపెట్ట నారంభించెను. శోభనాచలమే సొమ్ము నిత్తునని మొదట నొప్పుకొని, తరువాత నీయవలసిన యవసరము లేదనియు, రామచంద్రునే యడుగు మనియు, రాజమ్మను రహస్యముగా వర్తమానము నంపెను. శోభనాచలము తన స్నేహితునకుఁ బదునైదు రూపాయిలు బదులిప్పించి, తానిరువదిరూపాయిలు బదులుపుచ్చుకొని స్నేహితునిచేత సొమ్మిప్పించను లేదు. తానీయను లేదు. ధనము పుచ్చుకొన్నపుడున్న చౌరవయు, ధైర్యమును మరల సొమ్ము నిచ్చునపు డాతనియందుఁ గనఁబడవయ్యెను. తనస్నేహితుఁ డీయవలసిన ఋణమునకుఁ దా నుత్తరవాదిని గాననియుఁ, దనసొమ్మే తానీయఁగలననియుఁ జెప్పి, శోభనాచలము రామచంద్రుఁడు తనయింటికిఁ దడిమన్ను పొడిమన్నగునట్టు తిరిగినను నొక డబ్బయిన నీయక వచ్చినపుడెల్ల సాయంకాలము రమ్మని యొకమాఱును, నుదయము రమ్మని యొకమాఱును

సొమ్మందలేదని యింకొకమాఱును, మనసులో నేమియనుకొనవద్దని యొకమాఱును దనకుఁ జాలమొగమోటఁగా నున్నదని మఱియొకమాఱును జెప్పినమాట చెప్పక వానిని దిప్పుచుండెను. రామచంద్రుఁడేవేళప్పుడు సొమ్మిచ్చెనో కాని శోభనాచలమునకు సొమ్మెన్నఁడు నందనేలేదు. అవసర మెక్కువై తనయింటి కతఁడు వచ్చినకొలఁది శోభనాచలమునకు సొమ్మీయవలె ననునభిప్రాయము తగ్గి పలుమాఱతఁడు వచ్చినందులకు విసుగు హెచ్చెను. రామచంద్రుఁ డింటికి వెళ్ళినపుడు శోభనాచల మగుపడక యింటనుండక యొకవేళ నింటనుండిన లేఁడనిపించుచు, వీధిలో నెదురైనప్పుడు ప్రక్క సందులోనికైనను దగ్గఱ యింటికైనను బోవుచు, నట్లు చేయవీలుగానపుడు ముసుఁగు వేసికొని స్నేహితుల మధ్య దాఁగుచు మొగమున కేదయిన నడ్డము పెట్టుకొనుచుఁ, గాలము గడపుచు వచ్చెను. అతిస్వల్పకాలసంపాదితమైన వారిస్నేహము, క్రమక్రమముగా మొగమోటమై, లజ్జయై, మనస్పర్ధయై, నిష్ఠురమై యాగ్రహమై తుదకు రానురాను కలహముగాఁ బరిణమించెను. తుదకు రాజమ్మయొక్క బాధ పడఁజాలక యొకనాఁ డుదయాస్తమయములు వాకిటఁ గూర్చుండి వేంకటరత్నముతోఁ గూడ వచ్చుచున్న శోభనాచలమును బట్టుకొని రామచంద్రుఁడు విధిలేక యీప్రకారముగా మాటలాడ నారంభించెను.

రామ—అయ్యా శోభనాచలముగారు! ఎంతకాలము తమ యింటిచుట్టు నేను దిరిగినను నామీఁద ననుగ్రహ మింకను రాలేదు గదా? రాజమ్మగారు నన్ను నిలువనిచ్చుటలేదు. తేపో మాపో యింట నుండి నన్నామె వెడలఁగొట్టును. నామనవి చిత్తగించి లెక్క దయచే యుదురూ. తమ రుచితముగనిచ్చినట్లు సంతోషించెదను. పుచ్చుకొన్న సొమ్ముగాని మఱియొకటి కాదు.

శోభ—ఆగ్రహముతోఁ గన్ను లెఱ్ఱఁజేసి నీకేమయినఁ గొంచెముబుద్ధి యున్నదా లేదా? పెద్దపిన్న లున్నారను సందేహ మేమియు నక్కఱలేదా? అందఱు నీవలెఁ దుచ్ఛులే యనుకొన్నావా? నీవు బ్రతికిన బ్రతుకుకొద్ది నీపరువుకొద్ది యడిగినావు. నీసంప్రదాయ మెటువంటిది? నీసంగతి నేనాదినముననే గ్రహించినాను.

రామ—అయ్యా! తమకంతకోప మెందుకు? నేనేమన్నాను? నావల్లఁ దప్పున్న క్షమింపుఁడు.

శోభ—మేము నిన్ను క్షమింపఁ దగ్గవారమా! నీవే నన్ను క్షమించవలెను. చచ్చి చెడి యేలాగో రెండుగుల్లలు తెగనమ్ముకొని నీవు కాగా సొమ్ము సంపాదించినావు. నీదగ్గఱ బదులుపుచ్చుకొనుట నాదే బుద్ధితక్కువ. నీవీస్వల్పమునకు మొగము చిందుకొనుచున్నావుగాని యీలాటివి లక్షలు సంపాదించినాము. లక్షలు వ్యయము చేసినాము. నావంటివాని కిది యొకలెక్క కాదు.

రామ—అందుచేతనే త్వరగా దయచేయించండి, నేరమంతయు నాదే.

శోభ—ఇయ్యక మానుదువా యేమిటి? ఇచ్చినదాఁకఁ జచ్చినట్లుండు. అప్పుదునుకు రాదు. నీసొమ్మెంత చేయును? నీవెంత చేయుదువు? నీనైజము కనఁబఱచుకొన్నావు. నీసొమ్ము వారమునాఁటికి గిరగిరఁద్రిప్పి పాఱవేసెదను. నీకంటె నిర్భాగ్యుఁడుగాని నీసొమ్ము నపహరింపఁడు. నీకు గతిలేదు గాని మాకు లేకపోలేదు. ఉపకారమునకుఁ బోగా నపకార మెదురయినదఁట! వచ్చిననాఁడు మాయింట నుంచుకొని బంధువుఁడుగదా యని సమస్తవిధముల నాదరించినందుకా యీమాటలు. సాటి నియోగపువాఁడవని నీకింత నిర్వాహకము చేయవలెనని యనుకొన్నాను. అయ్యా వేంకటరత్నముగారు! ఆరాత్రి దొంగలుపడినప్పుడు దానుగుట్టవాఁడు భయపడునని దగ్గఱగా మీఁదఁ జెయ్యివేసికొని పండుకొన్నాను. ఆవిశ్వాసమయిన లేదు. ఈకాలములో నెవరికి నుపకారము చేయఁగూడదండీ! నాయనా రేపు నీసొమ్మునీకుఁ బంపెదను. ఇప్పటికి వెళ్ళు.

వేంక—ఇంత మంచివారు, మీతో నేపడినదికాదు. ఇంక నీ గ్రామమునం దెవరితో సరిపడును? బాగానే సార్థాపడఁగలఁడు. సరసముగానే యున్నది.

రామ—మీచిత్తము. ఇఁక నేనడుగను. ఆమాట మీరే దక్కించుకోవలెను.

శోభ—అమలాపురమునీ ళ్ళోడలఁబట్టినవి. పెంకెతనము ముదిరినది. మాటదక్కించుకోవలెనుగాదూ? ఇది జ్ఞాపక ముంచుకో.

రామ—మీరాచంద్రార్కము నాకు జ్ఞాపక ముండునట్లు చక్కనిపనిఁ జేసినారు.

అని మెల్లగా ననుకొని మాటలతోఁ దెమల్చి తన్ను శిక్షింపక దయదలఁచి పోనిచ్చినందులకు మనసులో సంతోషించుచు దేవునకనేక వందనములు చేయుచుఁ బూఁటకూటిదాని కేమిప్రత్యుత్తరము చెప్పుదునాయని యాలోచించుకొనుచు రామచంద్రుఁడు వచ్చెను. రాఁగానే రాజమ్మ వానిని జూచి యిట్లనియె.

రాజ—లెక్క తెచ్చినావయ్యా?

రామ—శోభనాచలముగారు—

రాజ—మాటకడ్డమువచ్చి శోభనాచలములేదు గీభనాచలము లేదు. నాయింటఁదిన్నవాఁడవు నీవా శోభనాచలమా? నాకతనితో నేమి? ఒడలెఱుఁగవు? ఎవరియబ్బసొమ్మని తిన్నావు? డబ్బుపుచ్చుకోకుండ నీకు మూడుప్రూఁటలు వండి కుంభముతోడుట కెవరు నీకచ్చియున్నారు. పోపో. నాయింటనుండి లేచిపో, చెంబు, పట్టుపంచె, నేనియ్యను నడునడు.

అంతకఠినముగా రాజమ్మ మాటలాడినప్పుడిఁక నచట నుండరాదని చివాలునలేచి రామచంద్రుఁడు వెళ్ళుచుండెను. అంతట నాతని మార్గమధ్యమందు వెనుక తనకు రెండురూపాయిలు నప్పిచ్చిన సహాధ్యాయుఁ డగుపడి రామచంద్రుని నిలువఁబెట్టి తనసొమ్ము తనకిమ్మని యడిగెను. వా రిట్లుమాటాడిరి.

సహా—ఏమోయి! అప్పుపుచ్చుకొని తిరిగి యిచ్చినావుకావు? ఒకనాఁడా రెన్నాళ్ళా? అంత గతిలేనివాఁడ వెందుకుపుచ్చుకొన్నావు? పోనీ యెగవేయి. దీనితో నీవు పెద్దకాపురముచేయవు నేను జెడిపోను. మర్యాదగాదు, నేనేలాటియవసరములో నీకిచ్చినానో నీవు నాకాలాగు రెండవకంటివాఁ డెఱుఁగకుండ నీయవద్దా? రేపు నీవీయకపోతివా నీకు నాకు బాగుగాజరుగదు. అని చెప్పి వెళ్ళిపోయెను.

చున్నారని భయపడుచు, నిశ్చేష్టుఁడై యుండెను. ఆబ్రాహ్మణుఁడు పాక లోనికి వచ్చి దుఃఖముతో "ఎంతపని జరిగినది. దైవమా!" అని విల పించుటచేతఁ దనశత్రుఁడు గాడని రామచంద్రుఁడు హీనస్వరముతో నిట్లు పలుకరించెను.

రామ—అయ్యా! మీ రెవరు బ్రాహ్మణులేనా!

బ్రాహ్మ—బ్రాహ్మణులమే. నీవెవరవు! ఇక్కడెందుకున్నావు?

రామ—నేనాఱ్వేలనియోగుల చిన్నవాఁడను. అమలాపురము నుండి వచ్చుచున్నాను.

బ్రాహ్మ—అయ్యా! మేము వైదికులము. నేను మిక్కిలి బీదవాఁ డను. నాభార్య యీవేళకుఁ దొమ్మిదిదినములక్రిందట బ్రసవమైనది. మగపిల్లవాఁడు గలిగినాఁడు. లేకలేకకలిగిన యామగపిల్లవాఁ డీదినమున సందుగొట్టి చనిపోయినాఁడు. నాభార్యకుఁ బ్రాణముమీఁదికి వచ్చినది. చచ్చినపిల్లవానిని దీసికొనిపోవుట కయినను, మాజాతివారును, మాబం ధువులును రాలేదు. కడుపుదుఃఖముతో నేనే యీపసికూనను బాతిపె ట్టవలసివచ్చెను. అని యేడ్చుచుండెను.

రామ—అయ్యా! దుఃఖపడకండి. మీరు పెద్దలు. అన్నియుఁ దెలిసినవారు. నావలెనే మీరును దురదృష్టవంతులు.

బ్రాహ్మ—నాయనా! నీకేమి కష్టములు గలిగినవి! ఇక్కడి కెందుకువచ్చినావు?

అని బ్రాహ్మణుఁ డడుగఁగా రామచంద్రుఁడు దనవృత్తాంతమం తయుఁ జెప్పి తనమీఁదికి వచ్చిన యాయపనిందయు, శరభరాజుగారు దన్ను లేవఁగొట్టుటయు, శోభనాచలాదుల వైరమును దెలియఁజేయ బ్రాహ్మణుఁ డాశ్చర్యపడి యితనికొఱకు విచారింప నారంభించెను. తరు వాత వారిట్లు మాటాడిరి.

బ్రాహ్మ—పూర్వజన్మకృత మెవరు తప్పింపఁగలరు? నీవు మా యింటికివచ్చి రేపుమాయింటనుండి వెళ్లుము. నీకుఁ బొడిగుడ్డల నిచ్చి యీపూఁట కొంచెము చలిమంటవేస్తాను రా.

రామ—అయ్యా! నాకొఱకు నాశత్రువులు వచ్చుచుందురు. ముందు మీరు నడువుఁడి. మీవెనుకనే నేనువచ్చెదను. ఎవరయ్యిన

వచ్చి నాజాడ లడిగిన పక్షమున వెనుకనున్నానని చెప్పవద్దు. నాకేదో సంజ్ఞచేయండి 'రామానుజాచార్యులు' అని నన్నుబిలిచిన నేను పారి పోఁగలను.

బ్రాహ్మ—నాప్రాణము నీప్రాణమున కడ్డమువేసి రక్షించెదను.

ఇట్లిద్దఱును బోవుచు గోదావరి గట్టుమీఁది కెక్కునప్పటికి జాముప్రొద్దుమాత్రమే యున్నది. అప్పుడు దాటియాకులగొడుగువేసి కొని యొకపురుషుఁడు వెండిమురుగులఁ బెట్టుకొనియున్న చాకలివా నిని వెంటఁబెట్టుకొని వచ్చుచుఁ దనయెదుట వచ్చుచున్న బ్రాహ్మణుని జూడక చీఁకటిచేత నాముసలిబ్రాహ్మణున కెదురుగాఁ బోయినందున గొడుగుకామ గ్రుచ్చుకొనెను. బ్రాహ్మణుఁడును దెబ్బతగిలినందున 'అబ్బా యెవరురానీవు? చంపివేసినావు. కన్నులు కనఁబడవా?' అని యఱచెను. రామచంద్రుఁ డదివిని యెవరో వచ్చినారని దిగఁబడి రాఁడయ్యెను.

పురు—అయ్యా! చూడలేదు. క్షమింపవలెను.

బ్రాహ్మ—నీదేయూరు నీవెవరవు?

పురు—మా దమలాపురము. మీ కిటువదేండ్లకుఱ్ఱవాఁ డగుపడి నాఁడా?

బ్రాహ్మ—నేనెఱుఁగను. మీపిల్లవాఁడెవరో నీవెవరవో నాకుఁ దెలియదు. చేతిలోకఱ్ఱలు మీరు నెవరికొంపఁ ద్రవ్వుటకు వచ్చినారు. బుఱ్ఱలు పగులఁగొట్టుటకు వచ్చినారా? దిక్కుమాల్నాళ్ళారా?

పురు—అయ్యా! తిట్టకండి. మేమెవరిని గొట్టుటకు రాలేదు. వేరే పనియుండి వచ్చినాము. మీ రాపిల్లవానిఁ జూచినపక్షమునఁ జెప్పండి.

బ్రాహ్మ—నేను జెప్పను ఇప్పుడు మాగ్రామమునందు మా తల్లి దగ్గఱనున్నవాళ్ళను గేకవేసి మీకుఁ దగినట్టు బుద్ధిచెప్పిస్తాను.

చాక—(కోపముతో) నోరుముయ్యి బాపనయ్యా! తెగనీలు గుతావేమి?

పురు—ఓరీ! ఆయనజోలికిఁ బోకురా. మనకుఁ గావలసిన మను ష్యుఁడు దొరకలేదు. మధ్య నాముసలిబ్రాహ్మణుని జోలికి వెళ్ళడ మెందుకు?

బ్రాహ్మ—అయ్యో! దుర్మార్గుఁడా! నీకుఁ గావలసినవాఁడు దొరకలేదూ? దొరికితే చంపివేస్తావా? నీకింత పాయ్యేకాలమేమిరా? అని మాటాడుచున్న బ్రాహ్మణునిదాఁటి యా క్రొత్తపురుషులిద్దఱును ముందుకుఁ బోవుచుండగాఁ జూచి బ్రాహ్మణుఁడు "ఆలాగువెళ్ళడమెందుకు? అక్కడవాఁడులేఁడు. ఆలా వెళ్ళవద్దు. వద్దంటే మానవేమయ్యా" అని చెప్పెను. అతనియాఁటంకమునుజూచి యాపురుషులు రామచంద్రుఁడక్కడనున్నాఁడని నిశ్చయించి యటువోవుచుండగా రామచంద్రుఁడు వారిబారిఁబడకుండ గబగబ బరుగెత్తసాగెను. ఈపురుషుని, వెంటఁదరుముచు, రామచంద్రునిగా నిశ్చయించి యెట్లయిన వానిని బట్టఁదలఁచిరి. కొంతదూరముపరుగెత్తి యాక్రొత్తవారిలో నొకఁడు "రామచంద్రుఁడూ నేను రాజగోపాలమును బరుగెత్తకు. నీవీలాగు రా. భయములేదు." అని పురుషుఁడు సెప్పగా రామచంద్రుఁడు ధైర్యమును విడిచి తనశత్రువులు రాజగోపాలముయొక్క పేరుఁ బెట్టుకొనినా రనుకొని రాక మరల నాతని కేకను విని దగ్గఱకువచ్చి రాజగోపాలమునుజూచి సంతోషించి యిట్లు పలికెను.

రామ—రాజగోపాలము! నీవెందు కీరాత్రివేళ వచ్చినావు? నాకు సహాయము జేసినందులకు మీబాబయ్యగారు నిన్నుఁగూడ లేవఁగొట్టినారా యేమి?

రాజ—లేదు. చాకలివానిచేత మూట నీకుఁ బంపినపుడు నీకు లెక్కయేమైనఁ బంపడము మఱచిపోయినాను. పెట్టెలోనుండి నాలుగు రూపాయిలు తీసి యివతలఁబెట్టి చాకలివానిచేతి కిచ్చుట మఱచినాను. ఇవిగో నాలుగురూపాయిలు పుచ్చుకో. నీవు సురక్షితముగా వచ్చినావా?

రామ—ఏమిసురక్షితము? చావుదప్పి కన్ను లొట్టవోయినట్లున్నది. నేను నీయుత్తరమును జూడగానే కొంతసేపు చెఱువుగట్టుమీఁద నాగి కపటియయిన యాసహాధ్యాయుని జోలికిఁబోక మఱినాలుగుజామలకు బయలుదేఱినాను. అప్పటికి శోభనాచలము ముందుగానే బయలుదేరి త్రోవలో-

రాజ—(మాటకడ్డము వచ్చి) ఆసోది చెప్పకు నాకుఁ బ్రొద్దుపో తుంది. మాయింటనందఱు నిద్రపోవుటగనిపెట్టి నేనిప్పుడు బయలుదేరి నాను. నాపరుపుమీఁద నేను బరున్నట్టుగానె యొకదిండుపెట్టి మీఁద బట్టగప్పి యింటిదొడ్డి తలుపు దీసియుంచి వచ్చినాను. మాబాబయ్య లేవకమునుపే వెళ్ళవలెను.

రామ—అయ్యో! నాకొఱకు నీవిట్లు శ్రమపడవలసివచ్చి నదికదా?

అని రామచంద్రుఁడు పోకముందే రాజగోపాలమును జాకలి వాఁడును బయలుదేరిరి. రామచంద్రుఁడు రాజగోపాలముయొక్క సద్గుణములను స్తోత్రముజేసి బ్రాహ్మణునితోఁ జెప్పుచు బ్రాహ్మణునియిం టికిఁ బోయి పాడిబట్టలు గట్టుకొని సుఖముగా నిద్రపోయెను. మఱు నాఁడు రామచంద్రుఁ డుదయమున గోదావరిలో స్నానముజేసి ముక్తే శ్వరస్వామివారిదర్శనము జేసి యాదిన మాబ్రాహ్మణునియింట వండు కొని భోజనముఁ జేసి, కోటిపల్లి పోవుటకు సిద్ధముగానుండగా, బ్రాహ్మ ణునిభార్యకు బాలింతరోగము వచ్చి మరణమునకు సిద్ధముగా నుండెను. వరహాయిచ్చినఁగాని వైద్యుఁ డామెకొక్కమాత్రనైన వేయకుండుటఁ జూచి, నవనీతమువంటిహృదయముగల రామచంద్రుఁడు కనికరించి తనకు రాజగోపాల మిచ్చిన నాలుగురూపాయిలను వైద్యున కిచ్చి యా బ్రాహ్మణునిభార్యకు మందువేయించెను. రామచంద్రునిచేతి ధనము వద లగానే బ్రాహ్మణుని భార్యకు రోగముకూడ వదలెను. బ్రాహ్మణుఁడు రామచంద్రుని సహాయమువలనఁ దనయాపద యనునదిని దాఁటెను గాని రామచంద్రునకు గోదావరీనది దాఁటుట కొక్కని యేగానియైన లేదు. ధనములేక యోజించుచున్న రామచంద్రున కొకమంచియాలో చన దోఁచెను. పూర్వమొకనాఁడు తాను రాజవోలు వెళ్ళుచుండగాఁ బడవ మునిఁగిపోయినపుడు ముక్తేశ్వరబ్రాహ్మణుని దాను రక్షించెను. అతఁ డనేక బహుమానములు దన కప్పు డిత్తుననియును, ముక్తేశ్వర మొక్కపర్యాయము రమ్మని తన్ను బ్రతిమాలినసంగతియు, రామచం ద్రునకు జ్ఞాపకము వచ్చి యాబ్రాహ్మణునిపేరు లింగరాజని తెలిసికొని, యట్టిస్నేహితుఁ డుండగాఁ దన కిఁక భయ మక్కఱలేదనుకొని లింగ

రాజుదగ్గఱకుఁ బోయెను. లింగరాజు రామచంద్రునిజూచి యిప్పటికి రమారమి యెనిమిది మాసము లయినందున వెంటనే యతని నాన వాలు పట్టఁజాలక కాఁబోలు, లింగరా జతనిఁ బలుకరింపఁ డయ్యెను. అవసరము రామచంద్రునిదే కనుక తుద కతఁడు మౌనము విడిచి మాటాడెను.

రామ—లింగరాజుగారూ! న న్నెక్కడనైనఁ జూచినట్లు జ్ఞాపకమున్నదా?

లింగ—మొగము జూచినట్లు జ్ఞాపక మున్నది కాని యెవరో చెప్పఁజాలను. మీదేయూరు?

రామ—మా దవళాపురము కాపురము. నాఁడు పడవమునిఁగి పోయినపుడు—

లింగ—(మాటకడ్డమువచ్చి) ఓహోహో! నీవఁటయ్యా! నాఁడు పడవ మునిఁగిపోయినపుడు నీవుకూడఁ బడవలో నున్నావు కావూ. నాకాసంగతి జ్ఞాపకమా. అది యేమాత్రపుగొప్పసంగతి. నూరువ్యవహారములలో మాకది జ్ఞాపకము రాదు. అయితే నీవిప్పు డీగ్రామ మెందుకు వచ్చినావు!

రామ—నిన్న నొకబ్రాహ్మణునియింట వంట జేసికొని భోజనము జేసినాను. మీదర్శనముఁ జేయవలెనని వచ్చినాను. మీరొక సహాయము జేయవలయును.

లింగ—ఏమిపనిమీఁద వచ్చినావు! అదియేదో చెప్పు. నా సాధ్యమయినపక్షమునఁ జూచెదను.

రామ—నేను గార్యాంతరమున గోటిపల్లి వెళ్లుచున్నాను. నాకు మీరు నాలుగురూపాయిలు బదు లిప్పింపవలయును. నాలుగు మాసములలోఁ దిరిగి యిచ్చివేయఁగలను.

లింగ—అయ్యో! ఇప్పుడే మీరు రాకముందు నూరురూపాయి లుండఁగా నొక పెద్దమనుష్యున కిచ్చినాను. ఒకగడియక్రింద వచ్చినపక్షమున గావలసినన్ని రూపాయిలిచ్చియుందును. నాలుగు గాకపోతే మఱినాల్గు పుచ్చుకొనవచ్చును. మీ రెక్కడికిబోతారు. నే నెక్కడికి

బోతాను. అయ్యయ్యో! రాకరాక మీరువచ్చి యడుగడము నా దగ్గఱ సమయమునకు లేకపోవడము సిగ్గుగనున్నది.

రామ—సరిసరి. మీకు సిగ్గెందుకు? అది నా యదృష్టము. మీ రేమిచేయఁగలరు పోనీ! రేపేమయిన సద్దెదనంటె యీగ్రామములో నుంటాను.

లింగ—ఉండు. ఏమయిన లెక్క దొరకిన పక్షమునఁ జూచి యిస్తాను.

ఈప్రకారముగా లింగరాజుదగ్గఱ నాల్గువేలరూపాయిలున్నను దనకు మహోపకారముజేసిన రామచంద్రునకు నాలుగురూపాయిలు బదులిచ్చుటకుఁగూడ నతనిమనసు సమ్మతింపదయ్యెను. ధన మీయకున్నను మర్యాదార్థము రామచంద్రుని భోజనమున కుండుమనియైనఁ జెప్పఁడయ్యెను. ఆమఱునాఁడు శరభరాజుగారియింటనుండి రామచంద్రుఁడువచ్చుటకుఁ గారణ మేమని లింగరా జడుగఁగా రామచంద్రుఁడు సత్యకాలపుమనిషి గనుక యున్నదున్నట్లు మాయామర్మములు లేకుండఁ జెప్పెను. మూఁడవనాఁడు రామచంద్రుఁ డేదోయొకటి నిశ్చయముగఁ దెలిసికొని లింగరాజువద్ద సెలవుదీసికొనిపోవలెనని యింటికి వచ్చునప్పటికి లింగరా జొకసంచిరూపాయిల ముందువేసికొని పేరూరినుండి భూమి తాకట్టుబెట్టుటకు వచ్చిన యొక యర్థవబ్రాహ్మణునితో వడ్డీనిగుఱించి ముచ్చటించుచుండెను. రామచంద్రునిజూడగానే యతఁడాధనమును జూచుటచేత నడుగునేమోయని భయపడి మహాకోపము వచ్చి దగ్గఱనున్న కుమారునిజూచి 'పిథవా! తలుపువేయుమని యెన్నిమాఱులుచెప్పినను వేయవుగదా' అని వానినొకచఱపు జఱచి లోపల సణుగుకొనుచుండెను. అప్పుడు రామచంద్రుఁడు వానిని బలుకరింపగా వారిట్లు మాటాడిరి.

రామ—అయ్యా లింగరాజుగారు! తమకీవేళ సొమ్మందినది కాఁబోలును. నేను నాలుగుదినములనుండి తమకొఱకు నిరీక్షించియున్నాను. ఏదైన దయచేయించిన పక్షమున సెలవుదీసికొని వెళ్ళిపోయెదను.

లింగ—అసూయతో నానిమిత్త మెవరు నిన్ను నిరీక్షింపుమన్నారు. నీపనిమీఁద నీవుండి నాకొఱకున్నాననియెదవేమి? నీకు

రూపాయి లెవరు పోగుబోసికొని కూర్చున్నారు? ఈరూపాయి లెవరి సొమ్మని నీకియ్యను? ఊళ్ళోవాళ్ళసొమ్మిచ్చినపక్షమున వారూర్కొరకుం టారా?

రామ—తమదగ్గఱ లేకపోయినపక్షమున మరెక్కడనైన బదులిప్పించండి. మీరుచెప్పినయెడల నాకెవరుబడితే వారే యిస్తారు. రెండు నెలలలోఁ దీర్చఁగలను.

లింగ—నా కెవరిస్తారు! నీ వేలాటివాఁడవో నేను నాలాటివాఁడనే యేలినాటిశనిలాగున బట్టుకొని వదలకుంటు న్నావేమి? దీనికి వేళాపాళాలేదూ? నీయవసరమే నీదా!

రామ—ఆదినము పడవమునిఁగినపుడు మిమ్ము నే బ్రతికింపగా నాకు బహుమానముఁ జేయుదునని ముక్తేశ్వరము రమ్మనినారుగదా? నాలుగురూపాయిలు బదులైన నియ్యలేరండి?

లింగ—నీవు నన్ను బ్రతికించినావా? శరీరమంత కాట్లకుక్కవలెఁ బెగఁగఱచి వదలిపెట్టినావు. ఆపుండ్లు నాలుగుమాసములవఱకు మానలేదు. ఒకనినొకఁడు బ్రతికింపఁగలఁడా? చంపఁగలఁడా? దైవానుగ్రహమున్నదిగనుక నేను బ్రతికినాను. నీకు బహుమానమియ్యడము నాకు విధిగాదు. దయాధర్మభిక్షము. ఇస్తే యిస్తాను లేకపోతే లేదు.

రామ—ఆసంగతి నిదివఱకే చెప్పినపక్షమున నేను వెళ్ళిపోదునే. ఇన్నిదినములు నన్ను తేపుమాపని త్రిప్పుటయెందుకు?

లింగ—నోటికి సుద్ధి బద్ధము లేదేమి? నేను నిన్ను౦త్రిప్పుచున్నానా! సొమ్ముండదని మొదటేచెప్పినాను. అమలాపురములో దొంగవస్తువులమ్మి మాయూరు పాడుచెయ్యవలెనని వచ్చినావా? నిన్ను గుమ్మములోనికి రానియ్యఁగూడదు. ఇంతంతబుద్ధులు నీకుండుటచేతనే ధర్మరాజువంటి శరభరాజుగారు నిన్ను లేవఁగొట్టినారు. నేనొకదమ్మిడినైన నియ్యను. నాయింటికి నీవు రావలసినపనిలేదు. నడునడు.

అని లింగరాజుగారు చెప్పగానే గంపంతయాశఁ బెట్టుకొన్న రామచంద్రునకుఁ గోపవిచారము లొక్క సమయముననే పుట్టెను; కాని కోపమును గనఁబఱచుట కది సమయముగాదు కనుక తన స్వాధీ

నములోనున్న విచారమును మఱియొకమాఱు తెచ్చుకొనెను. లింగరాజువంటి పరమవిశ్వాసఘాతుకుఁ డెక్కడైన నుండునా? పడవమునుఁగుటకు సిద్ధముగా నున్నప్పుడు దాను రామచంద్రు నెన్నివిధములఁ గాళ్లుగడుపులు బట్టుకొని వేడుకొనెనో నేఁ డన్నివిధముల దయాదాక్షిణ్యములులేక కసరికొట్టెను. అతని కేప్రకారముగ మనసువొప్పెనో తెలియదు. రామచంద్రుఁడు దన కగుపడగానే యతనిని జ్ఞాపకము దెచ్చుకొనియు, లింగరా జెఱుఁగనివానివలెను జ్ఞాపకములేనివానివలెను నటింప నారంభించెను. తనప్రాణమును రక్షించిన రామచంద్రునకుఁ దాను బహుమానము లిత్తుననియుఁ దన యావదాస్తి నిచ్చినను ఋణముదీరదనియుఁ జెప్పి వానిని ముక్తేశ్వరమురమ్మనిచెప్పిన లింగరాజు నాలుగురూపాయి లతనికి బదులైన నియ్యలేక యతిదీనముగ నున్న యాపిల్లవాని నన రానిమాటలని దరికిఁ జేరకుండఁ గొట్టెను. లోకములో నిట్టిలింగ రాజు లనేకు లున్నారు. ఆశ్చర్యమేల!

ఇట్లు నిర్విణ్ణమనస్కుఁడై యాశాభంగముచేత నాకస్మికదుఃఖమును గలిగి పడవదాఁటుట కొకడబ్బైనలేక గోదావరదగ్గఱ గూర్చుండి రామచంద్రుఁ డిట్లు విచారించెను.

"హా! దైవమా! మాచిరాజు శ్రీరాములగారి గర్భమునఁ బుట్టి యాగర్భశ్రీమంతుఁడ నైన నాకు రేవుపడవదాఁటుట కొకకానియైన లేకుండఁజేసితివి. నేనెక్కడ పాదముబెట్టిన నక్కడ నిర్ధూమధామ మగుచున్నది. నాకు మరణమైన నేల కలుగఁజేయవు! ఎన్ని దినము లన్నవస్త్రములులేకుండ బాధపడఁగలను? మాతండ్రిగారు పోయినదిమొదలుకొని యీనాఁటివఱకుఁ గష్టమేకాని సుఖమెఱుఁగను. నావంటిదిక్కుమాలినవాఁడు ప్రపంచమునం దెవ్వఁడులేఁడు. కడుపులో నున్నదుఃఖము నంతను జెప్పుకొందమన్న నిరుపార్శ్వముల బంధువులన్నమాట లేరుగద. ఈశ్వరా! ఇప్పటికైన నీకు నామీఁదఁ గనికరము లేదు కాఁబోలు." అని కన్నీళ్లు కాలువలుగట్ట నేడ్చుచుఁ దుదకింత పాడుబ్రతుకు బ్రతుకుటకంటెఁ బ్రాణత్యాగముఁ జేసికొనుట మంచిదని తనకష్టము లంతముచేసికొనఁదలఁచి, దుఃఖతాపముచేతఁ గల్గిన బాధ చల్లనియానదీగర్భమునందుఁ బ్రవేశించి తీర్చుకొన నిశ్చయించెను.

అప్పుడు ప్రదోషకాలమగుటచేత ముక్తేశ్వరస్వామివారియాలయమునకుఁ బోయి, యీశ్వరదర్శనముఁజేసి కడపటిసారి యా దేవునకు మనసు దీర మ్రొక్కి తనకువచ్చిన స్తవములన్నియుఁ బఠించి దేవున కెదురుగాఁ గూర్చుండి తాను కవిత్వము చెప్పఁగలవాఁడే కనుక తనదీనావస్థను దెలుపుకొనుచు నీక్రిందిపద్యములతో నీశ్వరుని స్తుతించెను.

చ. "కడపితి నింతకాలమును ♦ గష్టచయంబుల నొందుచుంటి నీ
పుడమిని మాతృగర్భమునఁ ♦ బుట్టినదాది సుఖింపలేదు నీ
యడుగుల నాశ్రయించి యిఁక ♦ నైన సుఖింపఁగఁ గోరుచుంటి నా
యెడఁ గరుణించి వేగముగ ♦ నీయవె మోక్షసుఖంబు నీశ్వరా.

చ. జనకుఁడుదీరె నాకు నతి ♦ శైశవమందె గతించెఁ దల్లియున్
మనమున నన్నుఁగూర్చి యణు ♦ మాత్రముపొక్కెడువారు లేరు నే
ననయము చేయిజాపుకొని ♦ యన్యులపంచల నుండఁజాల నో
యనఘ! కటాక్షముంచి వడి ♦ నంతము జేయవె కష్టజాలమున్.

ఆ. వె. అడుగరానివారి ♦ నడిగితి ద్రవ్యంబు
చేయరానిపనులఁ ♦ జేసినాఁడ
నన్న వస్త్రములకు, ♦ ననఘ! నన్ను క్షమించి
ముక్తినీయవయ్య ♦ భక్తవరద.

ఈశ్వరా! నే నిదివఱ కనేకపాపములను జేసినాను. నన్నేగతి కంపినను భారము నీదే. ఈదిక్కుమాలిన ప్రాణసంరక్షణకొఱ కనేకులకు బాధ నిచ్చినాను. నేటితో నాకష్టములన్నియు గట్టెక్కఁగలవు. కరుణించి నీసాన్నిధ్యమునుమాత్రము చేర్పుము. ఇదిగో నాచివరనమస్కార మందుకొను" మని చేతులుజోడించి మ్రొక్కి మరల 'నాకష్టములన్నియు సత్ప్రవర్తనమువల్లఁ గలిగినను నా కెన్నిజన్మములకైన సత్ప్రవర్తనమే దయచేయుము. నా కనేకోపకారములను జేసిన రాజగోపాలమును రక్షింపుము' అని గుడివదలి గౌతమీనదియొడ్డునకుఁ బోయి, బలవన్మరణము పాపహేతువని యెఱిఁగియు, దుఃఖముచేత నామాట మఱచిపోయి వంశమునకుఁ దా నొక్కఁడేకనుక తలిదండ్రులకుఁ గడసారితర్పణము వదలి బట్ట బిగియఁగట్టుకొని నడుమున నుత్తరీయమును జుట్టి జందెము మెడకుఁజుట్టి నదికి నమస్కారము జేసి కంఠము

లోఁతు నీళ్ళవఱకును బోయెను. పోయి యక్కడ నిలుచుండి యెక్కడనో తాటిపాకలోఁబుట్టి యతిసుకుమారముగాఁ బెరిఁగి రాజవోలు మేనమామయండను గొన్నాళ్ళుండి, యమలాపురమునకుఁ జదువుకొనుటకువచ్చి యపనిందపాలై ముక్తేశ్వరము వచ్చి గోదావరిలో బలవంతముగాఁ జచ్చుచున్న తన్నుగుఱించి విచారించి రాజగోపాలమును దలఁచుకొని యొకమాఱును మేనమామను దలఁచుకొని యొకమాఱు నేడ్చి చూచిచూచి యింత నిండుప్రాణము నెట్లు పోఁగొట్టుకొందునా యని భయపడి నాలుగడుగులు వెనుకకువచ్చి, చచ్చెడివానికి భయమెందుకని మరల లోఁతుకుఁబోయి, యెవరును లేరుగదా యని నాలుగు మూలలు బారఁజూచి, కన్నులు మూసికొని "హా దేవా" యని గుభాలున లోఁతునీళ్ళలోఁ జేతులు జోడించుకొని మునిఁగిపోయెను.

అతఁడొకమాఱు మునిఁగి యీఁతవచ్చినవాఁడుగనుక వెంటనే నీళ్ళుత్రాగక తేలెను. అపు డొకమనుష్యుఁడు తడిగోచితో వచ్చి రామచంద్రుని జుట్టుపట్టుకొని మొలలోఁతునీళ్ళవఱకును దీసికొనివచ్చి యక్కడ వానిని నిలువఁబెట్టి తానును నిలుచుండెను. అతనిని జూచి రామచంద్రుఁడు నిర్ఘాంతపడి కొంతసేపటికి "నీవెవ్వఁడ" వని యడుగఁగా నామనుష్యుఁ డిట్లుచెప్పెను. "అయ్యా! నేను బల్లెవాళ్ళ చిన్నవాఁడను. నేనును, మావాళ్ళుకొందఱును భద్రాచలమునుండి కలప తెప్పలుగట్టి నీలపల్లి తీసికొనిపోవుచున్నాము. గడియప్రొద్దువేళ మా పిల్లవాఁడు రేవులో నీఁతలాడుచుఁ జేతినున్న వెండియుంగరమును బాఱవేసినాఁడు. రెండుగడియలక్రిందట నేను నీళ్ళలో మునిఁగి యా వస్తువునిమిత్త మడుగున గూర్చుండి వెదుకుచున్నాను. ఇదిగో వస్తువు దొరకినది. నేను నీటిలోనుండి బయటికివచ్చినప్పటికి మీరు తేలిమునుఁగుచున్నారు. తక్షణమే నేనువచ్చి జుట్టుపట్టుకొన్నాను. నావస్తువు దొరకుటకాకుండ బ్రాహ్మణుని బ్రతికించినపుణ్యముకూడ దక్కినది. బాబూ! నేను సెలవుదీసికొని తెప్పమీఁదకు వెళ్లుతాను."

అని పల్లెవాఁడు చెప్పగాఁ దాను బలవంతముగా దిగినట్లు వానితోఁ జెప్పక నీవుమంచివాఁడవు. నాప్రాణ మీదినమున రక్షించినావు. అని వానిని బంపి తానును మెల్ల మెల్లగా బట్ట లారవేసికొని బ్రాహ్మ

ణుని యింటికిఁ బోవుచు నిట్లాలోచించుకొనెను. "నేను జచ్చిపోవుట దేవునకిష్టము లేదు. నేనేదో గొప్పయదృష్టమునకే బ్రతికినాను. నేనిఁకఁ జావను. నామీఁద దైవమునకు సంపూర్ణముగా ననుగ్రహముగలదు." అని వితర్కించుకొని, బ్రాహ్మణునియింటికిఁ బోయి పురుడు వెళ్ళిపోయి నది గనుక వానితోఁగలసి భోజనము జేసి రేవుదాఁటుటకు సొమ్ములే దని యాతనితోఁ జెప్పి కొంచెముసొమ్ము గలదేమో యని సిగ్గువడుచు నడిగెను. భూలోకమునం దవతరించిన కుచేలుఁడగు నాబ్రాహ్మణుఁడు గర్భదరిద్రుఁ డగుటచేత సొమ్ములేక ప్రాఁతబిందె నొకకోమటివద్దఁ దాక ట్టుబెట్టి పదునాలుగణాలు దెచ్చి రామచంద్రునకిచ్చి క్షమింపుమని వేఁడుకొనెను. ఉదయమున లేచి రామచంద్రుఁడు రేవుదాఁటి కోటిపల్లి వెళ్ళెను. గోదావరిలోఁబడి తేలుటచేతఁ దనకష్టములనుండి తాను దేలినట్లు రామచంద్రునకుఁ దోఁచెను. కోటిపల్లి వెళ్ళి రామచంద్రుఁడు మహారాజుగారియొద్ద నేదైన నుద్యోగమును దెచ్చుకొనవలెనని యో చించెను. కోటిపల్లి శ్రీమద్విజయనగరపుమహారాజుగారిది. మహారాజు గారు రాజధానియగు విజయనగరమునం దుండి యుద్యోగస్థుల మూ లమునఁ గోటిపల్లి సంగతియంతయుఁ దెలిసికొనుచు నప్పుడప్పు డాగ్రా మము వత్తురు.

---

## ఎనిమిదవ ప్రకరణము.



రామచంద్రుఁడు కోటిపల్లి వెళ్ళినపూఁట గుణములయందు రా జమ్మకప్పగారుగా నుండఁదగిన యొక పూఁటకూటిపెద్దమ్మయింట భోజ నముఁజేసెను. ఏలాగైన నొక చిన్నయుద్యోగమును సంపాదించుకొన వలెనని యతని కిష్టము గల్గియున్నదికాని తన కుద్యోగమునిచ్చువా రును నిప్పించువారును లేరు. కోటిపల్లి పరగణాకు శ్రీవిజయనగరపు మహారాజుగా రధికారులుగనుక వా రాపరగణాకు వల్లూరి శంకరరా వుగారిని బ్రధానోద్యోగస్థునిగా నేర్పఱచిరి. ఆయన సద్గుణసంపన్నుఁ డును, ధర్మకార్యనిరతుఁడును, బహుజనోపకారియునై మిక్కిలి కీర్తిగాం చెను. విజయనగర రాజ్యవిస్తారకులు ప్రస్తుతపు విజయనగరపుకోట

గట్టించినధన్యులు నగు శ్రీవిజయరామగజపతిమహారాజుగారు రాకాల మున దేశమును బరిపాలించుచుండిరి. శంకరరావుగారి యధికారము క్రింద నున్నప్పుడు కోటిపల్లి పరగణా మిక్కిలి నభివృద్ధి నొందుచు వచ్చెను. రామచంద్రుఁడా శంకరరావుగారి దర్శనముఁ జేయించుమని కచేరిలోనున్న యుద్యోగస్థులలోఁ గొందఱి నాశ్రయించి ప్రతిదిన మును వారివీధియరఁగులమీఁద సర్వకాలములయందుఁ గూర్చుండు చుండెనుగాని వారు మాటలతోనే కాని క్రియలతో నాతనిని సంతో షపెట్టరైరి. తుదకుఁ బ్రాణమువిసిగి రామచంద్రుఁడు తానే స్వయ ముగా శంకరరావుగారిని జూడవలయునని యాలోచించి గుమ్మముదగ్గ ఱకు వచ్చి లోపలికిఁ బోవుటకుఁ బ్రయత్నించెనుగాని గుమ్మముముం దఱ వెండిబిళ్ళలను వేసికొని పులితోలు ధరించి పూర్ణాధికారమును జరపుచున్న రాజభటు లానిరుపేదపిల్లవానిని లోనికిఁ బోనీయరైరి. రాజభటుఁ డొకఁడు శంకరరావుగారు నిద్రించుచున్నారనియు, మఱి యొకఁడు క్రొత్తమనుష్యుని రానిచ్చినపక్షమున బంతులవారు కోపిం తురనియు, వేఱొకఁడు పంతులవారు వ్యవహారమును జూచుచున్నార నియుఁ జెప్పి యందఱు వానినభ్యంతరపెట్టిరి. ఒకభటుఁడు రూపాయి దనకిచ్చినచో రామచంద్రుని లోపలికిఁ దీసికొనిపోదుననియు, మఱొకఁ డర్ధరూపాయి నిచ్చినఁ దీసికొనిపోదు ననియు వారందఱు బేరముల నాడ నారంభించిరి. లంచముల నిచ్చి రామచంద్రుఁడు శంకరరావు గారి దర్శనము చేయుట కిష్టములేక గుమ్మముముందఱ నాల్గుదినములు పడియుండియుఁ, దుద కతఁడు పంతులవారిదర్శనము దొరకనందున విచారాక్రాంతుఁడై యుండెను. పూఁటకూటియింటనుండుటచేతఁ దాను దెచ్చిన పదునాల్గణాలును వ్యయమయ్యెను. రామచంద్రుఁడు కోటిపల్లె గ్రామముఁ బ్రవేశించిన యయిదవదినము సాయంకాలమునందు శంకర రావుగారు గుడిభుజముమీఁద నెట్టినిరుమాలు నెడమభుజముమీఁద నుప్పాడలోఁ బురమాయించి నేయించి చలువచేసిన సన్ననిజరీ యుత్త రీయమును వైచికొని చేతిలో వెండిపొన్నుగల యొకసున్నని సన్నపేప బెత్తమును బట్టుకొని, టక్కుటిక్కుమని తొడుగుకొన్న ముచ్చెలు ధ్వనిఁజేయ రాజభటుఁడొకఁడు ముందుగా నడచి యెదుటవచ్చుచున్న

మార్గస్థుల నందఱి నొత్తిగించుచుండ, నెవరితోడనో మాటలాడుచు, గోదావరియొడ్డునకుఁ జల్లగాలి నిమిత్తము వచ్చిరి. సమయమును నిరీక్షించి రామచంద్రుఁడు పంతులుగారి వెంటనే వచ్చి యాయన దనవైపు దిరిగినపుడు నమస్కరించెను. శంకరరావుగారును దిరిగి నమస్కరించి రామచంద్రునివృత్తాంత మడుగ నతఁ డామూలాగ్రముగాఁ దన చరిత్రమును వినిపించెను. దానిని శంకరరావుగా రొకచిత్రమైన కథవలె విని యాశ్చర్యపడి రూపురేఖావిలాసములను బట్టి యాతఁ డొక గొప్పయింటివాఁడనియు హృదయ మిచ్చి మాటాడుటచేత నతఁడు నిర్దోషియనియుఁ, జూపులనుబట్టి చాకచక్యముగలవాఁడనియుఁ దెలిసికొని తమకచ్చేరియం దిరువది రూపాయిలపని యుండగా దాని నతని కిచ్చిరి. ముత్యాలకోవవలెనున్న యతనివ్రాఁతయుఁ, బనియందుఁగల శ్రద్ధయుఁ, పైయధికారులయందుఁ గలిగిన విధేయతయును శంకరరావుగారికి రామచంద్రునియందు దయఁగలిగించెను. తనపని నతివేగముగా ముగించుకొని రామచంద్రుఁడు కచ్చేరీలోనున్న మందమతులయొక్కయు, సోమరిపోతులయొక్కయుఁ బనులు గూడఁ జేసిపెట్టసాగెను. శంకరరావుగారు తప్ప కచ్చేరీలోనున్న యుద్యోగస్థులందఱును లంచగొండులయి ప్రజలను గ్రహములవలెఁ బీకుకొని తినుటచేత రామచంద్రునికాకార్య మయిష్టమగుటచే లంచముల గ్రహించువారిని మందలించుచు, బాధపడుచున్న బీదకాఁపులను సహాయముఁ జేయుచు, నాతఁడు జనసమ్మతమైన పురుషుఁడయ్యెను. శంకరరావుగారికిఁ దరువాత నుద్యోగస్థుఁడు దామరాజు పద్మనాభముగారు. శంకరరావుగారికి నెలకు రెండువందలయేఁబదిరూపాయిలజీతము. పద్మనాభముగారికి నెలకు నూటయేఁబది రూపాయిలజీత మున్నను నతఁడు లంచగొండులకెల్ల నగ్రగణ్యుఁడై, తనకుఁ గావలసి నన్ని లంచములను గ్రహించుచుఁ, గ్రిందియుద్యోగస్థుల కిప్పించుచు, భార్యమెడలో నగలు దిగవేసి లక్ష్మితోఁ దులఁదూఁగుచున్నందున, రామచంద్రుఁడు లంచములపేరయిన వినఁడుగనుక వారికందఱకుఁ బరమశత్రువై యుండెను. దేశముననున్న కాఁపులందఱును, దమయిండ్లకర్మాదులఁ జేయించి యాచించు బ్రాహ్మణుల నెట్లో స్వల్పదానములచేతఁ దృప్తిపఱచుచుండిరి కాని, తమ

యిండ్లకెన్నఁడునురాక మాటిమాటికిఁ బాదపూజలు దెమ్మని పత్రికల నంపుచుఁ దమ కుపవాసవ్రతము నేర్పుచుఁ గచ్చేరీలోనున్న యీబ్రాహ్మణో త్తముల నెంతో ధనమిచ్చి పూజించియు, వారియనుగ్రహపాత్రులు గాకయే యుండిరి. ఈకారణముచేత రామచంద్రుఁడు చిన్నయుద్యోగస్థుఁడయ్యుఁ దనకంటె ననేకరెట్లెక్కువ జీతముగల గొప్పయుద్యోగస్థులకుఁగూడఁ బక్కలో బల్లెమై, తనపేరు చెప్పినమాత్రమున వారు భయపడునట్లు ప్రవర్తించుచుండెను. తక్కువవాఁడైనను సన్మార్గుఁడు, గొప్పవాఁడైన దుష్టునకు భయహేతువేకదా. రామచంద్రుఁ డాయుద్యోగములోఁ బ్రవేశించిన యాఱుమాసములకే శంకరరావుగారతనికి ముప్పదిరూపాయిలపని నిచ్చిరి. రామచంద్రుఁ డెప్పుడును దురదృష్టవంతుఁడె కనుక నింతలో మహారాజుగారు శంకరరావుగారిని నాలుగువందలరూపాయిల జీతముమీఁద విజయనగరమునకు రమ్మని యుత్తరువుజేసిరి. శంకరరావుగారు వెంటనే ప్రయాణమై శ్రీమహారాజుగారితో రామచంద్రుని సత్ప్రవర్తనాదులఁగూర్చి విన్నవింతుమనియుఁ, ద్వరలో నీతని నభివృద్ధికిఁ దెత్తుమనియు, వాగ్దానముఁజేసి వెళ్ళిరి. ప్రాపకులు వెళ్ళిపోవుచున్నందునను మిగిలినవారు దనకు శత్రువులగుటను రామచంద్రునకు శంకరరావుగారి పోక విచారముగానుండెను. లంచగొండుల కంటకశిఘువలెనున్న శంకరరావుగారు వెళ్ళిపోయినందులకు సంతోషించుచున్న చిన్నయుద్యోగస్థుల యదృష్టముననో రామచంద్రుని దురదృష్టముననో శంకరరావుగారి యుద్యోగము పద్మనాభముఁగారి కయ్యెను. పద్మనాభముగారు క్రొత్తయధికారమును వహింపఁగానే, రామచంద్రునియందుఁ గ్రోధమును గూఁడ వహించి యతఁడు చక్కఁగాఁబనిఁజేయుచున్నను, సోమరియనియు, నవిధేయుఁడనియుఁ, బెంకెవాఁడనియు, వ్రాసినదెల్లఁదప్పనియుఁ దిట్టుచు, మహారాజుగారికీసంగతిఁ దెలియఁజేతునని బెదరించుచు, జీతములో సగము గునహాల క్రిందనే తగ్గించుచు నానాతిప్పలఁ బెట్టసాగెను. రామచంద్రుఁడును దైవముమీఁద భారమువేసి ధర్మమే జయించునని శాంతించి యూరకుండెను.

అక్కడ నమలాపురములో రామచంద్రుఁ డెందులోనోదిగి ప్రాణ

హత్యఁ జేసికొనినాఁడని యందఱు ననుకొనిరి. కృష్ణవేణమ్మ దన కుమారుని నిమిత్తమే విచారించినట్లు విచారించెను. శరభరాజుగారును దన మూలమున నిష్కారణముగ బ్రాహ్మణహత్య తటస్థమయినదని విచారించి సోమావధానుల నడిగి కొన్ని జపములు చేయించి దోషశాంతిని జేసికొనుచుండెను. రాజగోపాల మారహస్య మెఱిఁగినవాఁడేకనుక తానుగూడ విచారించినట్లు నటించునేకాని నిజముగా దుఃఖింపలేదు. తల్లి చంద్రులకావ ర్తమానము నెఱుఁగఁజేయను లేదు. వేంకటరత్నము బ్రహ్మానందభరితుఁడయి తన కింద్రాధిపత్యము వచ్చినట్లుండెను. పార్వతికి వేరుసంబంధములు వచ్చెను. పార్వతివివాహపుమాట జ్ఞాపకమైనప్పుడెల్ల శరభరాజుగారు రామచంద్రుని మరణమునకుఁ దానె కారణుండని విచారించుచుండెను. గ్రామములోనివా రందఱు శరభరాజుగారితో నప్పుడప్పుడు రామచంద్రునివిషయమై మాటలాడుచు నతఁడు మహాసద్గుణుఁడనియు, వానినివెళ్ళగొట్టినందున వారికిఁ బాపము గలదనియుఁ జెప్పుచువచ్చినందున శరభరాజుగారికి రామచంద్రుని వెడలఁగొట్టినందులకుఁ గొంచెము విచారము కలుగుచుండెనుగాని యాయన కనుమానము సంపూర్ణముగా నివారణకాలేదు. ఒకనాఁడు శరభరాజుగారును, చాకలివాఁడును గలసి రాత్రి జామైనతరువాత దొడ్డవర మత్యావశ్యకమైన పనిమీఁదఁ బోవుచుండఁ ద్రోవలో నొక నూఱుగజములదూరమున నొకవివాద వినఁబడెను. ఆరాత్రివేళ చీఁకటిలోఁ గలహమాడుచున్నవారెవరో తెలిసికొనవలెనని శరభరాజుగారు కొంచె మాగిరి. వివాదపడుచున్న యామనుష్యులిద్దఱును శరభరాజుగారినిగాని చాకలివానినిగాని చూడక తమ కదివఱకు జరగుచున్న కలహమును మానరైరి. శరభరాజుగారువెళ్ళి యక్కడ నిలుచున్న తరువాత నాపురుషుల కిట్లు వివాదము జరిగెను.

ప్రథముఁడు—అంతకోపము గలవాఁడవైన పక్షమున నాభాగము నాకుఁ బారవేయరాదా? ఎంతన్యాయమో యంత నాకిచ్చివేయి.

రెండవవాఁడు— నీ కియ్యవలసినదేమో నేనిదివఱకే యిచ్చినాను. నాదగ్గఱనిప్పుడేమియు లేదు. నే నిప్పుడు వీథిలోనికి వెళ్ళుట లేదు. నాకాలు తెగవాఁచినది. అడుగుదీసి యడుగుఁబెట్టలేక యలోలక్షణా

యని నే నేడ్చుచున్నాను.

ప్రథ—అవసరములు దీరినవికదా? ఏరుదాఁటి తెప్ప దగులఁ బెట్టినావు. కావలసినదంత నీచేతఁ జిక్కినదికదా. నీ వెన్నియాటలనైన నాడెదవు. నాజుట్టు నీచేతిలోనున్నదిగనుక నీవీలాగునఁ జేసినావు.

రెండ—కోపముతో నీవు నాకుఁ జేసిన సహాయము లేమిటి? నేనుజేసిన ద్రోహము లేమిటి? ఆవేళ వస్తువు లమ్మగా వచ్చిన సొమ్ములోఁ బాతిక రూపాయిలు పుచ్చుకొంటివి. అంతకంటె నీకెక్కువ యేలాగున రాఁగలదు.

ప్రథ—ఛీ, నోరుముయ్యి; అమ్మినవాని కేఁబది, నీకేఁబది నాకేఁబది, యనికాదా మొదట నేర్పరచుకొన్నది. తక్కినపాతికి నాకియ్యన క్కఱలేదా? కష్టపడియమ్మి నానాబాధలు పడ్డవాళ్ళము మేమును, బయినుండి కఱ్ఱపెత్తనముఁజేసి యెక్కువలాభమును గొట్టెవాఁడవు నీవునా!

రెండ—తెగనీల్గుతావేమి. పొట్టకూటికిఁ జెరిన వెధవవు. నీకియ్యను. నీయబ్బతోఁ జెప్పుకో. మెత్తమెత్తగా నూరకొన్నందుకా వేషములు వేస్తావు. నీవేషములు నాదగ్గఱ తీసిపెట్టు.

ప్రథ—నీ బెదరింపులు నాదగ్గఱ కావు. బ్రహ్మచారివిధవవు. నీవీలాగే గొంతుక గోస్తావని నే నప్పుడే యనుకొన్నాను. నీమాటలు నమ్మి నిష్కారణముగ నేను రామచంద్రునితో విరోధముదెచ్చుకొని యేమిఱెఱుఁగని పిల్లవానిని నానాహింసలుపెట్టినాను. తప్పంట్లు నీవే తీసికొన్నావు. నీవు నేను బోగయి వానికొంపఁ ద్రవ్వినాము. ఇంత దిక్కుమాలిన బుద్ధులున్నవి కనుకనే పాముగఱచినది.

రెండ—నీవుమాత్ర మెన్నిపాములు గఱవకుండ దాఁటఁగలవు? ఇల్లలుకగానె పండుగ కాలేదు? నీవు నన్నాక్షేపింప నక్కఱలేదు. నాకంటె నీవు రెండాకులెక్కువచదివినావు. మంత్రిప్రగడవారి వంశమునఁ జెడఁబుట్టినావు. నీమూలమున శరభరాజుగారు దలయెత్తికొని తిరుగడములేదు.

ప్రథ—నీయంతదుర్మార్గుఁడనుగానులే. ఇంట జూదమొకటిపెట్టి యందఱి నింటికిఁ బిలిచి కొంపలు దీయడములేదు. కూచిమంచి వారంతా యగ్రహారములు గట్టించి కీర్తిసంపాదించుచున్నారు. నీవు బ్రహ్మ

చారివై లోకము తగులఁబెట్టుచున్నావు. సిగ్గులేక యింక మాటాడ వలెనా?

రెండవ—బ్రహ్మచారినైనను నీవలె ముండనుంచుకొని దాని చేతికూడు దినుటలేదు. అబ్రాహ్మణముండకొడుకా, నోరుముయ్యి, సిగ్గులేదేమి?

ప్రథ—నాముండజోలి నీకెందుకు! దానిసంగతి నీవెత్తకు. ఏమయిన నన్నను. రామచంద్రుని యుసురుకొట్టి చచ్చిపోతావు.

రెండవ—నేను తమ్మంట్లు దీసికొన్నాను. నీవు దొంగవస్తువు లమ్మించినావు.

ప్రథ—వానిమేనమామ చచ్చినాఁడని దొంగవర్తమానము జెప్పించిన మహానుభావుఁడవు నీవేకాదూ? నేనాలాటిపనులు చేయలేదు.

రెండ—ఛీ, విధవవు. చెప్పుదీసికొని చెంపలుపగులఁగొట్టుతాను.

ప్రథ—కొట్టకపోతే నీవు బ్రాహ్మణుఁడవుగావు. ఏదీ కొట్టు.

రెండవ—హోముగుఅచినప్పటినుండి నాకాలువాఁచి కదలనీయ డములేదు. అందుచేత లేవలేనుగాని లేకపోతే నిన్నీవేళ చంపివేతును విధవా.

ప్రథ—ఆపని నేనేచేస్తాను చూడు. అని కఱ్ఱతోఁ గొట్టెను.

రెండవ—ఆఁ ఆఁ—కొట్టుకొట్టు. అని చేతులడ్డము పెట్టుకొను చు నీలాగు దొళ్ళుదోవవచ్చినదేమిరా. నీసంకటము కుదర్చఁగలనులే.

ఇట్లాపురుషులిద్దఱు నొకరిరహస్యము లొకరు బయటఁబెట్టు కొనుచుఁ గలహమాడుచుండగా శరభరాజుగారామాటలు విని యందులో నొకఁడు వేంకటరత్నమనియు, రెండవవాఁడు శోభనాచల మనియుఁ గంఠధ్వనినిబట్టి యానవాలుపట్టి చాకలివానితోఁగూడ వారి యెదుటకుఁబోయి నిలిచిరి. ఎదుటనిలిచిన శరభరాజుగారిని జూచి వేం కటరత్నమును శోభనాచలమును భయవిస్మయములతోఁ గదలలేకపో యిరి. అప్పుడు శరభరాజుగారు వారితో నిట్లుమాటాడిరి.

శర—ఏమిరా వేంకటరత్నము! ఈవివాదమేమిటి? నీకు శోభ నాచల మెందుకు సొమ్మియ్యవలెను? నీకును శోభనాచలమునకును గల వ్యవహారమేమిటి?

వేంక—తలవంచి యూరకొన్నాఁడు.

శర—ఓరీ దుర్మార్గుఁడా! నీవేమో నమ్మకముగలవాఁడవనియు నాకుఁ బ్రతిష్ఠఁదెత్తువనియు నేననుకొన్నాను. సత్పురుషుఁడయిన రామచంద్రునికూటిలో దుమ్ముబోసిన మహానుభావుఁడవు నీవేనా! మామం త్రిప్రగడవారి వంశమునఁ దప్పఁబుట్టినావురా! నీమాటలనునమ్మి నిష్కారణముగా రామచంద్రుని లేవఁగొట్టినాను. అతనిమనస్సెంత క్షోభపడి నదో! మేనమామ చచ్చినాఁడని దొంగవర్తమాన మతనికిఁ జెప్పి వానిచే దొంగవస్తువుల నమ్మించి యాసొమ్ము మీరు పంచుకొన్నారా? అవురా! ఎంతవాఁడవురా! ఘండాలుఁడా!

శోభనాచలముతో "ఏమయ్యా, నీకు బుద్ధిలేదు. అభము శుభము నెఱుఁగనికుఱ్ఱవాని తమ్మంట్ల నపహరించుటకు నీకుఁ జేతు లేలాగువచ్చినవయ్యా! పాముగఱచి బాధపడుచున్నావు. నీకిప్పటికైన సిగ్గురాలేదా? మీరిద్దఱు మేకతోలును గప్పుకొన్న పెద్దపులులు గదా!

శోభ—శరభరాజుగారి కాళ్ళమీఁదఁబడి "అయ్యా! రామచంద్రుని సమస్తవిధముల భంగపఱచినాము. ఈ వేంకటరత్నమును నేనును గలసి చేయరాని పాపములన్నియుఁ జేసినాము. తమరు క్షమించినట్లయిన నింకొక్క సంగతినిగూడఁ జెప్పెదను. తమ పిల్లవాని వస్తువులు—"

శర—ఆశ్చర్యముతో మాటకడ్డమువచ్చి యవితీసి కుఱ్ఱవాని నోట గుడ్డలుకుక్కినవారు మీరే? అయ్యో! ఇఁకమిమ్ము బ్రతుకనీయఁ గూడదు. మీరు లోకములను మ్రింగివేయఁగలరు. ఎంతవాళ్ళయిన నవుదురురా మీరు. అన్నా వేంకటరత్నము! మాయింటనుండి మాకు ఱ్ఱవానినే చంపఁదలఁచుకొన్నావా? ఛీ నాయెదుటనుండి లేచిపో. నీమొగమును జూడఁగూడదు.

వేంక—ఏడ్చుచు "అందులో నేనేమియెఱుఁగనండీ. మీపాదములసాక్షీ."

శోభ—అయ్యా! మీనరసింహముయొక్కవస్తువులు నేనును మఱియొక్కఁడునుగలసి తీసినాము. వేంకటరత్నమందులో నేమియు

నెఱుఁగఁడు. నావంటి మహాపాతకుఁ డెక్కడను లేఁడు. నేను రామచంద్రుని గొట్టుటకు వెళ్ళుచుండగా ముక్తేశ్వరము త్రోవలో నన్ను బాముగఱచినది. నేను రోగము చేతఁ దీసికొనుచున్నాను. నాకు బుద్ధి వచ్చినది. ఇఁక నే బ్రతుకను. నన్ను క్షమించండి. నాకభయమిచ్చినదాఁక మీకాళ్ళువదలను.

శర — ఓరీ వేంకటరత్నము. మాయింటనుండి లేచిపో. రామచంద్రుఁడు చచ్చిపోయినాఁడుగదా. నీమూలమున నాకు బ్రాహ్మణహత్య కూడ వచ్చినది.

వేంక — అతఁడు కోటిపల్లెలో నున్నాఁడట. చచ్చిపోలేదు.

శర — ఇఁక నాతో మీరు మాటాడవద్దు పొండి.

అని శరభరాజుగారు ప్రయాణమును మానుకొని గ్రామమునకుఁ దిరిగివచ్చి యింట నందఱితో నాసంగతిఁ జెప్పగా వారందఱును నిజము నేఁటికిఁ దెలిసినదికదాయని సంతోషించిరి. రాజగోపాలను పరవశత్వమును జెందెను. శరభరాజుగారు బ్రాహ్మణులను క్షోభ పెట్టుట సంపన్నగృహస్థులకు క్షేమముగాదని యోజించి శోభనాచలమును వేంకటరత్నమును క్షమించిరికాని తిన్నగా విచారింపకుండ రామచంద్రుని క్షోభ పెట్టినందులకుఁ బరిపరివిధముల నొచ్చుకొనుచుఁ బశ్చాత్తాపమును జెందిరి. మఱునాఁ డుదయమున లేచి సోమావధానులను బిలిపించి, పార్వతిని రామచంద్రునకిచ్చి వివాహముఁ జేతుననియు, ముహూర్తమును బెట్టుమనియుఁ జెప్పి మంచిలగ్నమును బెట్టించి, రాజగోపాలము శరభరాజుగారు సోమావధానులును గలసి రామచంద్రునితో నీసంగతిఁ జెప్పుకొనుటకు మధ్యాహ్నము బయలుదేరి కోటిపల్లె వెళ్ళిరి.

శంకరరావుగారు విజయనగరమునకుఁ బోవుటవలన నేఁబదిరూపాయిలపని కచ్చేరిలో నూరకయున్నందున నాపని రామచంద్రునకు నియ్యఁగూడదని పద్మనాభముగారు వ్రాసినను, శంకరరావుగారి సాహాయ్యముచేత నది రామచంద్రునకే యయ్యెను. ఆపని యాతనికైన నెల దినములకుఁ గోటిపల్లి పరగణాయందుఁ గొన్ని తొందరలు గలిగినందునఁ దన్నివారణార్థము మహారాజుగారు శంకరరావుగారి నక్కడకంపిరి. ఆయన వచ్చినతోడనే వ్యవహారములన్నియుఁ జక్కఁబడెను. ఆయన

నాల్గుమాసము లక్కడనుండిరి. క్రమక్రమముగా శంకరరావుగారికిని రామచంద్రునకును బరస్పరానురాగ మభివృద్ధిజెందెను. శరభరాజుగారును రాజగోపాలమును సోమావధానులును, వచ్చి రామచంద్రుని యిల్లు తెలిసికొని యతని యెదుటికిరాఁగా వారిని జూడఁగానే రామచంద్రుఁ డాశ్చర్యపడెను. తరువాత వారి నందఱను రామచంద్రుఁడు మర్యాదచేసెను. ఒకరి యోగక్షేమముల నొకరడిగినవెనుక వారిట్లు మాటాడిరి.

శర—రామచంద్రుఁడూ! నీకు నేను మహోపకారమును జేసినాను. నీవెట్లు మాయలోఁ బడినావో నేనును నష్టపడినాను. నన్ను నీవు క్షమింపవలెను.

రామ—మీరంతమాట సెలవియ్యవద్దు. మీరుపొరపడినారు. మీరదివఱకుఁ జేసిన యుపకారమును నేను మఱవను. ఇది యెల్ల మీంచలవేకదా.

శర—నేను మాపార్వతిని నీకిచ్చి వివాహముఁ జేసెదను. వివాహమీ వేళకుసరిగా నెలయున్నది. ఉభయులకుఁ గావలసిన సొమ్మంతయు నేనే వ్యయముచేసెదను. మీబంధువుల నందఱి నీలోగాఁ బిలిచి మా బంధువులకు శుభలేఖలు వ్రాసిపంపెదను. అప్పటికి నీవు సెలవుబుచ్చుకొని రావలెను. పాలకిగూడ నక్కడనే కుదిర్చియుంచుతాను. మేమింకఁ బ్రయత్నములు చేసికొంటాము.

రామ—మాపినతండ్రిని మామేనమామను బిలువవలసినది. అంతకంటె నాకు బంధువులు లేరు.

రాజ—రామచంద్రుఁడూ! శోభనాచలమును వేంకటరత్నమును దమలోఁదాము కలహమాడి యొకరిరహస్యముల నొకరు బయలుపెట్టుకొనిరి. అది మాబాబయ్యవిన్నాఁడు. నిజము నేఁటికిఁ దెలిసినది. వేంకటరత్నమును లేవఁగొట్టినారు.

రామ—దైవానుగ్రహమున్నది కనుక నిట్లయినది.

ఇట్లు వివాహము నిశ్చయించి యారాత్రి వారందఱు నక్కడ నుండిరి. రామచంద్రుఁడు శరభరాజుగారిని శంకరరావుగారియొద్దకుఁ దీసికొనిపోయి దర్శనముచేయించి యీకాలపు విశ్వాసఘాతుకులవలెఁ

గాక తానుద్యోగముచేయుచున్నను బూర్వము శరభరాజుగారియింట దానున్నట్లు చెప్పుకొనుట కభిమానము లేక యాయన తనకుఁజేసిన మహోపకారముల నెల్ల నుగ్గడించి శరభరాజుగారి గుణములను దగు నట్లు శ్లాఘించెను. వారందఱును మఱునాఁడు ప్రయాణమైపోయిరి. రామచంద్రుఁడు వివాహనిమిత్త మొకమాసము సెలవిమ్మనియడిగెను. పద్మనాభముగారు వీలు లేదని యుత్తరువు జేసిరి. ఈవర్తమానము రామ చంద్రుఁడు శంకరరావుగారితోఁ జెప్పగా నాయన పద్మనాభముగారిని జీవాట్లుపెట్టి సెలవునిప్పించిరి. వివాహ మొకవారమున్నదనగా రామ చంద్రుఁ డొకనాఁడు వీధియరఁగుమీఁదఁ గూర్చుండగా నతని పిన తండ్రి జగన్నాథమువచ్చికూర్చుండి రామచంద్రునితో నిట్లుచెప్పెను. 'నాయనా విన్నావా జరిగిన సంగతి. శరభరాజుగారు నీకుఁ దనకొమార్తె నిత్తునని ముహూర్తముఁ బెట్టించి మమ్ముల నందఱినిబిలిచి తిరిగి నాలు గుదినములక్రిందట వేరే క్రొత్తసంబంధము నిశ్చయించుకొన్నారఁట. మన సంబంధముకంటె గొప్పది తెచ్చుకొన్నారు. వెయ్యిరూపాయీలు వరదక్షిణకూడ నిచ్చినారఁట. గొప్పవారుగనుక చెల్లినది. మనమీలాటి పనిఁ జేసినపక్షమున సాటివాళ్ళు తాటియాకులు గట్టుదురు. వారి నెవరు నోరెత్తి మాటలనలేకపోయినారు. గొప్పవాళ్ళందఱికి వినాశ కాల మీలాగేయుండును. చూడు వారుచేసిన నగుబాటుపని.'

రామ—విస్మయముతో శరభరాజుగారలాటిపనిఁజేయుదురా?

జగ—చేయకేమి. ఆయన పైకాలా గగుపడునేకాని లోపల విషము. నీవు నీచుఁడవఁట. ఆశరభరాజుగారికి నీకియ్యవలెనని యున్నది కాని నీచపుసంబంధమని బంధువు లందఱు నాక్షేపించినారఁట. అందు చేత నీకు వేఱొకసంబంధము గుదిర్చినాను. నీకిష్టమున్న పక్షమునఁ జేసికొనవచ్చును.

రామ—నీవే పెద్దవాఁడవు. నీకిష్టమైనసంబంధము దీసికొనిరా.

జగ—కపిలేశ్వరములో మనవారున్నారు. వారు శరభరాజు గారికన్న గొప్పవాళ్ళు. సంవత్సరమునకు నాలుగువేలరూపాయీలు వారికి భూములమీఁద వచ్చును. పిల్ల మకరమువంటిది. పెమ్మరాజు ప్రసా దరాయఁడుగారి కొమార్తె. నీ మంచియోగ్యతనుజూచి నీకుఁ బిల్ల

నియ్యవలెనని వారికున్నది. ఆయన మిక్కిలి మంచివారు. ఆయన వార ముదినములలో నిక్కడికి వచ్చి నిన్నుఁజూచి ముహూర్తము నిశ్చయిం చుకొందురు.

రామ—గొప్పవారిని నమ్మఁగూడదు. చెప్పెడుమాట యొకటి చేసెడిదొకటి.

జగన్నాథ మీవర్తమానమంతయు రామచంద్రునితోఁ జెప్పి మఱునాఁడు వెళ్ళిపోయెను. శరభరాజుగారు వేఱుసంబంధము గుదు ర్చుకొనుటచేత రామచంద్రుఁడు మునుపటి ముహూర్తమునకు నమ లాపురము వెళ్ళలేదు. జగన్నాథముగారు వెళ్ళిన పదిదినముల కొకనాఁ టిరాత్రి పండ్రెండుగురుబోయీల పాలకి నెక్కి యొకకాగడా వేయిం చుకొని మంచిబట్టలు ధరించుకొని పెమ్మరాజు ప్రసాదరాయఁడుగారు వచ్చిరి. రామచంద్రుఁ డాయన కెదురుగాఁబోయి తీసికొనివచ్చి మర్యా దజేసెను. ఆయనతోఁగూడ నొకబ్రాహ్మణుఁడు పసుపు, కుంకుమ, పండ్లు చాకలివానిచేతఁ దెప్పించి యచటఁబెట్టెను.

ప్రసా—అబ్బాయీ! మీపినతండ్రిగారు వచ్చి నీతో మాట లాడినారా?

రామ—సంగతులన్నియుఁ దెలిసినవి. ఆయన వచ్చినారు.

ప్రసా—వివాహ మిప్పటి కాఱునొక్కదినములున్నది. సిద్ధ ముగానుండు. మాపిల్ల చిన్నతనమందు జబ్బుపడినపుడు మేము వేంక టేశ్వర సాన్నిధ్యమందు వివాహము చేయుదుమని మ్రొక్కుకొ న్నాము అందుచేత వాడపల్లెలో నీకార్యముఁ జేయఁదలఁచు కొన్నా ను. ఒక్కనాఁటి పెండ్లియని సందేహింపకుమనిచెప్పి బ్రాహ్మణుఁడు దెచ్చిన పసుపు కుంకుమ రామచంద్రుని కిప్పించెను. బోయీలు సవారిఁదీసికొని వెళ్ళిపోయిరి. బ్రాహ్మణుఁడును వారితో వెళ్ళెను. ప్రసాదరాయఁడు గారక్కడ మఱునాఁడుండిరి. ఆదినమున నాలుగుగడియల ప్రొద్దెక్కిన తరువాత రామచంద్రుఁడును ప్రసాదరాయఁడుగారును మాటలాడు చుండగా రాజగోపాలమువచ్చి రామచంద్రునితో నీప్రకారము కఠిన ముగ మాటాడెను.

రాజ—ఏమోయి రామచంద్రుడూ! పరువైన నియోగుల యింటఁ బుట్టినావుగదా! నీవీలాటిబుద్ధు లెక్కడ నేర్చుకొన్నావు? నీకు మాసంబంధ మిష్టమున్న యెడల రావలెను. ఇష్టములేని పక్షమున రామని స్పష్టముగాఁ జెప్పవలెను. నీమాత్రపు పెండ్లికొడుకు మాకుఁ గుదురకపోఁడు. మొదటవస్తానని చెప్పి ముహూర్తము పెట్టించి రాక మోసముచేయఁదలఁచుకొన్నావా? నలుగురుబంధువులలో నగుబాటు వచ్చి తలయెత్తికొనలేక పోయినాము. ముహూర్తముదాఁటిన తరువాత నీవురావని మీపినతండ్రిగారు సెప్పినారు. ఆమాట మొదట మాతోఁ జెప్పకపోయినారా?

ఆమాటలు విని రామచంద్రుఁ డాశ్చర్యపడుచుండఁగాఁ బ్రసాదరాయఁడుగారు దొందరపడనారంభించిరి. ఇంతలో శంకరరావుగారు గుమ్మనుముందఱికి వచ్చి "కామయ్యా! ఇక్కడేనా?" యనియడిగెను.

కామ—"ఇక్కడేనండి. అదుగో దిక్కుమాలినముండాకొడుకు నాకొంపఁదీసినాఁడు." అని యఱచెను.

శంక—కామయ్యా! తొందరపడకు. సంగతియంతయుఁ జెప్పు.

కామ—అయ్యా! ఆకూర్చున్నవాఁడు నాకొమార్తె నెత్తుకొనిపోయి రామచంద్రుని కిచ్చి దొంగతనముగా వాడపల్లెలోఁ బెండ్లి చేయఁ దలఁచుకొన్నాఁడు. ఈదుర్మార్గుఁడు దినమున కొక్కవేషము వేసికొని లోకమును మోసముచేయుచుండెను.

శంక—అతని చెవులనున్న తమ్మంట్లు మాతమ్ముని చెవుల నుండెడి వని తోఁచుచున్నది.

రాజ—ఓయీ ప్రసాదరాయఁడా! నీసంగతియంతయుఁ జెప్పు. నిన్ను తక్కువశిక్షతోఁ బోనిత్తుము. లేనిపక్షమున నీపాట్లు నీవనుభవింపఁగలవు.

ప్రసా—అయ్యా! నన్ను క్షమింపవలెను. నేఁటికి నేను దొరకినాను. మాది నిడదవోలు కాపురము. నాపేరు చామర్తి జనార్దనము.

రామ—అయ్యా! ఇతని పేరుయొక్క పొడియక్షరములున్న రుమాలు మాకు దొరకినది. దానిమీఁద 'చా. జ' యనియున్నది.

శంక—అతని వృత్తాంతము నంతను జెప్పనిండు.

ప్రసా—నేను జిన్నతనమునందె పిత్రార్జితమగు ద్రవ్యమంతయు జూదమునందు వ్యయపెట్టి జోగినై యమలాపురము ప్రవేశించి కూచి మంచి శోభనాచలమునకు స్నేహితుఁడనై యనేక పాపములను జేసినాను. శోభనాచలముయొక్కయు, వేంకటరత్నముయొక్కయుఁ బ్రోత్సాహముచేతఁ గఱ్ఱా రామయ్యయను పేరుబెట్టుకొని, యీరామచంద్రుని మేనమామ చచ్చినాఁడని దొంగవర్తమానమును జెప్పినాను. దేశిరాజు . సూర్యనారాయణ యను పేరుబెట్టుకొని యిత్తడికంటెను, గాజురాయివేసిన యిత్తడి యుంగరమును రామచంద్రుని కిచ్చి బంగారపు వస్తువులని యమ్మించినాను. శరభరాజువారి రెండవకుమారునినగలన్నియు నేను శోభనాచలమును దీసికొని పిల్లవానినోట గుడ్డలుకుక్కినాము. తరువాత నాకును వారికిని వివాదమువచ్చినది. ఇప్పుడు రామచంద్రుని పినతండ్రి జగన్నాథము నాయొద్దకువచ్చి రామచంద్రునకు శరభరాజుగారి సంబంధము వచ్చుట కోర్వఁజాలక యీపెండ్లిఁ జెడఁగొట్టి బీదపిల్లను జేయుమని నన్ను వేఁడుకొన్నాఁడు. కాఁబట్టి నేనీవిధముగా నీబ్రాహ్మణునికొమార్తెను దొంగిలించుకొని రామచంద్రునకుఁ బెండ్లిఁజేయఁదలఁచుకొన్నాను. నేఁటికి మీచేతఁ జిక్కినాను.

శంక—నిన్ను వదలరాదు. ఏమోయి వీరాస్వామి! ఈతనిని బట్టుకొని సంకెళ్లువేయండి.

అని సంకెళ్లువేయించి చామర్తి జనార్దనమును విజయనగరమంపించెను. అక్కడ మహారాజుగారతనికి నాలుగుసంవత్సరములు చెఱసాలలో నుంచునట్లు శిక్ష విధించిరి.

అందఱు నాదినమున నిండ్లకుఁబోయిరి. మఱునాఁడు శంకరరావుగారువచ్చి రామచంద్రునితో నిట్లనిరి. “అబ్బాయీ! నీకు నాకొమార్తెనిచ్చి వివాహముఁజేయవలెనని యున్నది. నీకుఁ జేసికొనుటకేమైన నభ్యంతరమున్నదా? మాపిల్లను జేసికొన్నయెడల నీవు మిగుల నభివృద్ధిని బొందఁగలవుసుమీ” యనిచెప్పగానే రామచంద్రుఁడు “మీరు నన్ను క్షమించవలెను. నేనిదివఱకే శరభరాజుగారి కొమార్తెను జేసికొనుటకు నిశ్చయించుకొన్నాను. మధ్య నీజనార్దనమువచ్చి యంతరాయమును గలిగించినాఁడుకాని యీపాటికి .వివాహమయియుండును.

కాని మన నియోగులలోనెల్ల మంత్రిప్రగడవారు మిక్కిలి గొప్పవారు. శరభరాజుగారికి సంవత్సరమునకు మూడువేలరూపాయీలు వచ్చును. ఆయన జ్యేష్ఠకుమారుఁడు రాజగోపాల మిప్పుడు మాయింటనున్నాఁడు. అతనికి మీకొమార్తెనిచ్చి వివాహముఁజేయవలసినది. అన్నివిధముల నాకంటె గొప్పసంబంధము." అనిచెప్పగా శంకరరావుగారు "నీవు వారిపిల్లను జేసికొనవలసినది. మాట తప్పఁగూడదు. నీపెండ్లియైన తరువాత చూచుకొందము. నీవు వెళ్లుము." అనిచెప్పిరి. రామచంద్రుఁడు శరభరాజుగారి సంబంధముకంటె శంకరరావుగారిసంబంధ మెక్కువదనియు, దానివలనఁ దన కనేకలాభము లున్నవనియు నెఱిఁగి మాట ముందుగా నిచ్చినందునను, జిన్నతనమునందు శరభరాజుగారియింట నున్న విశ్వాసముచేతను, శంకరరావుగారి సంబంధమును నిరాకరించి శరభరాజుగారి కొమార్తెనే చేసికొనుటకు నిశ్చయించి యమలాపురమునకు రాజగోపాలముతోఁ గూడఁ బోయెను. త్రోవలో వారిట్లు మాటాడిరి.

రామ—నేను బెండ్లికిరానని మీతో నెవరుచెప్పినారు? ముహూర్తమునాఁడు మీ రేమనుకొన్నారు?

రాజ—ముహూర్తమునాఁడు నీవింకనువత్తువని కనిపెట్టుకొని కూర్చున్నాము. ఎంతసేపటికిని నీవు రాకపోగా సెలవు దొరకలేదనుకొన్నాము. ఆమఱునాఁడు మీపినతండ్రివచ్చి "మావాఁడు మీసంబంధమును జేసికొనఁడఁట. ఆయన కింతకంటె నెక్కువవారెవరో వచ్చినారు. మీయిష్టమువచ్చినట్లు మీరు చేసికొనండి" యనిచెప్పెను.

ఆమాటలువిని రామచంద్రుఁ డాశ్చర్యపడి తనపినతండ్రియొక్క యోర్వలేమికి సిగ్గుపడుచుఁ, దనతో నతఁడు సెప్పినమాటలును, బ్రసాదరాయఁడుగారి సంబంధములును జెప్పి రాజగోపాలమును గడుపుబ్బలగునట్లు నవ్వించుచు నమలాపురము జేరి శరభరాజుగారు మొదలగు వారికిఁగూడ నీవృత్తాంతమును దెలియఁజేసెను.

శరభరాజుగారిదివఱకే వివాహప్రయత్నములను జేసినందున వైశాఖశుద్ధ నవమినాఁడు రామచంద్రుఁడు పార్వతిని బెండ్లియాడెను. రామచంద్రుని మేనమామయు నాతనికుటుంబమును దప్ప మఱియేబం

వులును బెండ్లికొడుకువైపున రాలేదు. పెండ్లివారికి విశ్వనాథశాస్త్రి గారియింట విడిదినేర్పఱచిరి. ఉభయులకును గావలసిన ద్రవ్యమంతయు శరభరాజుగారే వ్యయముచేసి పెండ్లి సమస్తవైభవములతోడను జేసిరి. శ్రావ్యమైన తూర్యారావములతోడను, ముత్తయిదువుల పాటలతోడను, బచ్చనిపందిళ్ళతోడను, విప్రాశీర్వాదధ్వానములతోడను వివాహము మనోహరముగా జరిగెను. శరభరాజుగారు తక్కువ సంబంధము దెచ్చుకొన్నారని వారిబంధువు లెవ్వరును రాలేదు. అమలాపురమునందే విద్యార్థిగానుండి యచ్చటనే యుపనింపపాలయి, మరల నా గ్రామమునందే కడుమర్యాదగా వివాహమాడుచున్న రామచంద్రునిం జూచి యందఱును [illegible]ంచిరి. అయిదుదినములును వివాహమైన తరువాత పదు[illegible]దినము[illegible]ండుగ యగువఱకు నమలాపురమునందే యుండి పిమ్మట కోటిపల్లె వెళ్లెను. వివాహమైన రెండుమాసములలోనే శంకరరావుగారు [illegible] శరభరాజుగారి జ్యేష్ఠకుమారుఁడను రాజగోపాలమున కిచ్చి పెండ్లిఁజేసిరి. ఇట్లు శరభరాజుగారును శంకరరావుగారును వియ్యంకులగుటచేత రామచంద్రునియందు శంకరరావుగారు [illegible] నెక్కువదయగానుండిరి. తరువాత రాజగోపాలమునకు శంకరరావుగారు విజయనగరమునం దుద్యోగము నిప్పించి యతనినచ్చటికిఁ దీసికొనిపోయిరి. వివాహమైన యెనిమిదిమాసములకే పార్వతి వ్యక్తురాలయినందున మఱినాలుగుమాసములకు శరభరాజుగారామెకుఁ దగినసారె బెట్టి కాపురమునకుఁ బంపిరి. పార్వతియు రామచంద్రుఁడును గోటిపల్లెలోఁ గాపురము చేయుచుండిరి.

స మా ప్త ము.

# ఆంధ్ర గ్రంథములు.

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| కపాలకుండల, నవల | 0 | 12 |
| రాజర్షి ,, | 0 | 14 |
| సౌందర్యతిలక | 1 | 0 |
| హేమలత | 0 | 12 |
| రామచంద్రవిజయము | 0 | 12 |
| తారాభాయి, చక్కని నవల | 0 | 12 |
| దిలారామ ,, | 1 | 4 |
| సాంఘికదౌర్జన్యము, | 0 | 14 |
| ఆనందమంఠ, నవల | 0 | 12 |
| మనోహారి, నవల | 0 | 14 |
| వీరబాల ,, | 0 | 8 |
| లాలాభాయి ,, | 0 | 8 |
| ఆంధ్రరాష్ట్రము ,, | 0 | 14 |
| **వివిధగ్రంథములు** | | |
| బాలచంద్రోదయము, అలఘుకౌముది బ సీతారామాచార్యులవారిది | 0 | 8 |
| వెంకయ్యవ్యాకరణము | 0 | 4 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | 0 | 8 |
| హిందీఇంగ్లీషుబాలశిక్ష | 0 | 4 |
| హిందీ తెలుఁగుబాలబోధ | 0 | 3 |
| డిటో మొదటివాచకము | 0 | 8 |
| పెద్దబాలశిక్ష, చక్కనిప్రతి | 0 | 8 |
| ఆంధ్రద్రవిడబాలశిక్ష | 0 | 3 |
| ఆంధ్రకన్నడబాలశిక్ష | 0 | 3 |
| తెలుఁగుసామెతలు. ఇంగ్లీషు తర్జుమాతో | 1 | 0 |
| పాకశాస్త్రము | 1 | 8 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు | 0 | 10 |
| క్షేత్రయ్యపదములు | 0 | 14 |
| వాశిష్ఠరామాయణము, ద్విపద | 1 | 4 |
| గాంధిమహాత్ముని హైందవస్వరాజ్యం | 1 | 0 |
| గాంధిమహాత్మునిజీవితము, వ్యాసములు, ఉపన్యాసములు, ఉపదేశములు | 1 | 8 |
| బాలవ్యాకరణము | 0 | 12 |
| ఆకాశవిమానములు, ప్రతిమలతో | 0 | 8 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాంకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | 4 | 0 |
| **పెద్దచ్చుగ్రంథములు.** | | |
| ఆదిపర్వము, మేలుకాకితములు, చిన్నసైజు | 1 | 8 |
| అమరము, ప్రథమకాండము | 0 | 2 |
| రుక్మిణీకల్యాణము | 0 | 2 |
| గజేంద్రమోక్షము | 0 | 2 |
| బాలరామాయణము | 0 | 1 |
| కాళహస్తిశతకము | 0 | 1 |
| కుమారీశతకము | 0 | 1 |
| కృష్ణశతకము | 0 | 1 |
| దాశరథిశతకము | 0 | 1½ |
| నారాయణశతకము | 0 | 1 |
| నృసింహశతకము | 0 | 1½ |
| ప్రసన్నరాఘవశతకము | 0 | 1½ |
| భాస్కరశతకము | 0 | 1½ |
| మానసబోధశతకము | 0 | 1½ |
| రామలింగేశశతకము | 0 | 1½ |
| రామరామశతకము | 0 | 1 |
| శిఖినరసింహశతకము (శకునశాస్త్రము) | 0 | 1 |
| సుమతిశతకము | 0 | 1 |
| రామరాఘవశతకము | 0 | 1 |
| రామతారకశతకము | 0 | 1 |
| వేణుగోపాలశతకము | 0 | 1½ |
| గరుడాచలము, యక్షగానము | 0 | 2 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

# భక్తిరసశతకసంపుటము-౧.

భక్తిరసశతక మొదటిసంపుటములో భక్తిరసోద్బోధకములగు ఈక్రిందిశతకములను చేర్చి ముద్రించితిమి. శతకములన్నియు నిర్దుష్టముగ మనోహరముగ ముద్రింపఁబడి విపులములగు పీఠికలతో నలరారుచున్నవి. 1 వృషాధిపశతకము, 2 చెన్నమల్లుసీసములు, 3 సర్వేశ్వరశతకము, 4 ఒంటిమిట్టరఘువీరశతకము, 5 దేవకీనందనశతకము, 6 నారాయణశతకము, 7 దాశరథిశతకము, 8 సింహాద్రినారసింహాశతకము, 9 కృష్ణశతకము, 10 మాతృశతకము, 11 ఉన్నవరాజగోపాలశతకము, 12 మానసబోధశతకము, 13 చిత్తబోధశతకము, 14 ఆంధ్రనాయకశతకము, 15 ప్రసన్నరాఘవశతకము, 16 రామతారకశతకము, 17 రామరాఘవశతకము, 18 రామప్రభుశతకము, 19 భద్రాద్రిరామశతకము, 20 మారుతిశతకము.

# భక్తిరసశతకసంపుటము-౨.

ఇందు 1 సూర్యనారాయణశతకము, 2 రాజలింగశతకము, 3 రఘుతిలకశతకము, 4 మహిషాసురమర్దనిశతకము, 5 ఉద్దండరాయశతకము, 6 గొట్టిముక్కల రాజగోపాలశతకము. 7 రుక్మిణీపతిశతకము, 8 జ్ఞానప్రసూనాంబికశతకము, 9 ముకుందశతకము, 10 శివశతకము, 11రమానాయకశతకము, 12 భక్తచింతామణిశతకము, 13 సీతాపతిశతకము, 14 మహిజామనోహరశతకము, 15 పార్థసారథిశతకము, 16 రాజశేఖరశతకము, 17 రంగేశశతకము, 18 మాధవశతకము, 19 కామేశ్వరీశతకము, 20 విశ్వనాథశతకము.

ఈశతకసంపుటములు చిన్నసైజులో పెద్దఅక్షరములతో ముద్రింపఁబడి ముద్దులుగులుకు చక్కని కాలికోబైండుతో నలరుచున్నవి.

భక్తిరసశతకసంపుటము 1-వ సంపుటము, పైనుదాహరించిన 20 శతకములుగలది. రూ. 2 0

డిటో 2-వ సంపుటము రూ. 2 0